# OPINION

Late Sri,

D. Narasimha Sastry, M. A., L. T.

District Educational Officer,

ANANTAPUR.

I have gone through the 'Ruins of Hampi' written by Sri N. Peraraju, Telugu Pandit of the Board High School, Uravakonda. It is a piece of historical Literature which is worthy of a place in every High School Library of the Telugu Districts.

(*Sd.*) D. Narasimha Sastry,

D/ 9—3—45.

# జాతీయ గీతము

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా !

పంజాబ్ సింధు గుజరాత్ మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా

వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా

తవ శుభ నామ జాగే తవ శుభ ఆశిష మాఁగే
గాయేఁ తవ జయగాథా

జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్య విధాతా !
జయహే - జయహే - జయహే
జయ జయ జయ జయహే !

No. 166/C d/ 3-11-'44.

From :

R. E. Mortirner Wheeler, M. C. D. (Litt.), F. S. A.
Director General of Archaeology in India.

To :

N. Pera Raju Esquire,
Telugu Pandit,
Board High School,
URAVAKONDA,
Anantapur Dt., Madras Presidency.

Sir,

There is no objection to the production of the illustrations of the Guide to Hampi mentioned in your letter dated the 23rd October 19th, 44 provided that the source of the illustrations is suitably acknowledged by writing below each picture the words "Copyright, Archaeological Survey of India", or in the preface of the book and that a copy of the book in which the photogrophs appear is presented free of cost for the Central Archaeological Library attached to my Office.

Yours faithfully,
*(Sd.)* N. P. CHAKRAVARTI,
For Director General.

# విజ్ఞప్తి

ప్రపంచమున మహోన్నతదశయందుండి పాడుపడిన పట్టణము లనేకములు గలవు. అందు గొన్ని పౌరాణికముగను - మఱికొన్ని చారిత్రకముగను ప్రసిద్ధికెక్కినవి. హంపి - అట్లుగాక, రెండింటను బేరుగాంచినది. ఈ పుస్తకమునందు హంపియొక్కయు, నందలి పరిశిష్టములయొక్కయుఁ జారిత్రక గాథలు సమగ్రముగ వ్రాయఁబడినవి.

ఈ గ్రంథమును రచించిన శ్రీ నూతలపాటి పేరరాజుగారాంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. వీ రింతకుమున్నె మూలమూలలఁ బడియున్న విజయనగర సామ్రాజ్యవైభవము నొక్కచో నలంకరించి, విజయనగర చరిత్రను రచించి, యాంధ్రలోకమునకు మహోపకారమొనర్చిరి. ఉన్నత పాఠశాలా పండితులుగా, గ్రంథవ్యాఖ్యాతలుగాఁ బ్రసిద్ధులగుటయేగాక, గ్రంథకర్తలుగా వెలసిన వీరి యమూల్యపరిశ్రమ మెంతయుఁ బ్రశంసనీయము. వీరు రచించిన యీ "హంపీశిథిలము" లను పొత్తమును మేము కోరఁగనే యొసఁగినందులకు మే మెంతయుఁ గృతజ్ఞులము.

— ప్రకాశకులు

# అవతారిక

విజ్ఞానమెయ్యది?— అన్నచో నిదమిత్థమని నిర్ణయింపఁజాలము. విజ్ఞానము పలుతెఱఁగులు. హద్దుల నేర్పఱచి, దాని స్వరూప మిట్టిదని శాసింపఁజాలము. విజ్ఞాన సముపార్జన స్రోత స్సైతి మనేకభంగులు. అందు— గ్రంథ పరిచయముచేఁ బడయఁదగు విజ్ఞానము స్థూలమైనది. కేవలము భాషావిజ్ఞానార్జనకు గ్రంథములు సాధనములుగా నుపకరించునే కాని, భావసంపద సమకూరవలెనన్న గ్రంథములు సమగ్రమైన యుపకరణములు కాఁజాలవు. కవులను, బండితులను భావభరితమైన కావ్యసృష్టికిఁ బ్రేరేపించిన ప్రకృతి ప్రధానపాత్రత వహించును. 'విలియమ్ వర్డ్సువర్తు' బోటి యాంగ్ల మహాకవులు ప్రకృతిమాత యొడిలోఁ బాఠములు నేర్చిరి. ప్రకృతినే కావ్యవస్తువుగా గానముఁ జేసిరి సుందరమైన విశాల ప్రకృతి సందర్శనముచే వారు మన స్థూల దృష్టి కెఱుకపడని విజ్ఞానమును మన కందఁజేసిరి. దృశ్య, శ్రవణములయందు దృశ్య ప్రభావము సూక్ష్మమైనది; స్థిరమైనది. ప్రకృతిశోభను, మర్మములను, స్వాభావికతను నేరుగా మన కన్నులద్వారా వీక్షించి, తదనుభూతియందుఁ దాదాత్మ్యమును బొందక మధ్యవర్తి యగు కవి నయనములద్వారా సందర్శింప నెంచుట మన గ్రుడ్డితనమును బ్రదర్శించుట యగును.

మానవునియందు నయనము - మనస్సు - సన్నిహితములు. నయనముల నాకర్షింపఁ గలిగినది మనస్సునకుఁ బదిలముగా ముద్రగొనును. విశాల ప్రకృతిలో విహార మొనర్చి, యందు గర్భితమైన విజ్ఞానమును గైవస మొనర్చుకోఁదగును. విశిష్ట శిల్పకళా నైపుణ్య మంతయు మూర్తీభవించిన కళాక్షేత్రముల వైభవమును గవులు, చరిత్రకారులు గ్రంథస్థ మొనర్చిరి. వీరి వివిధ క్షేత్రములందలి శిల్పశోభ నెంత రసవత్తరముగా రచించినను దాత్కాలికానుభూతిని మనోక్షేత్రములందు సృష్టించుకొనుట దప్పఁ జదువరులు సహజానుభూతిని, శాశ్వత మనోవేశమును బడయఁజాలరు.

పూర్వాంధ్రుల మహోన్నత సంస్కృతి వారితోనే సమయలేదు. వారి జీవిత సర్వస్వము శిల్పకళారూపమున రామణీయకమగు ప్రకృతిశోభతో సమైక్యమునొంది, స్థిరత్వము వహించి యలరారుచున్నది. నాగార్జునకొండ, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, మహాబలిపురము, అమరావతిస్తూపములు- అజంతా, ఎల్లోరా విహారములు- హంపీ క్షేత్రములే కాక, యితరక్షేత్రము లనేకములు నల్గడల నిల్చి, ప్రాచీనవైభవమును భూత, వర్తమానములకుఁ దార్కాణముగాఁ జాటుచున్నవి. ఈ కళాక్షేత్రముల యందలి శిల్పము మహోన్నతము. మన ప్రాచీనుల చరిత్రను, సంస్కృతిని సజీవముగా సమర్పించునవి యీ కళాఖండములు. నాఁటివారు నిష్కల్మషులై, నిర్మలమైన సాత్త్విక, సాంఘిక జీవన మొనర్చుచు నాధ్యాత్మిక తత్పరులై, యచేతనమై, స్తబ్ధతవహించి శాశ్వతనిద్రఁబూనిన శిలలను మేల్కొలిపి, గిలిగింతలుపెట్టి, వానిని సర్వతోముఖమైన తమ జీవితవైభవమునకుఁ బ్రతిబింబములుగా మార్చి యీ కళాక్షేత్రములను రూపొందించిరి. వీనిని వర్ణింప నమకట్టిన, వానినుండి జాలువారు సక్షా

జత్వము జాఱిపోయి, పేలవమైనను, ఉత్ప్రేక్షింపఁబడినను, వర్ణన కృత్రిమత్వమునే పూనును. వీక్షించియే వాని విన్నాణమును నరయవలయును గాని, యాకర్ణించి యానందపడుట- శరద్రాత్రులయందలి పూర్ణచంద్రికల శోభను వర్ణింప విని యానందించు నంధుని భాతి యగును.

విద్యా (విజయ) నగరముయొక్క ప్రాచీన వైభవము శత్రువుల దాడి కెరయై, శేషించిన శోభతో సర్వోత్కృష్టముగా నలరారుచున్నది హంపీక్షేత్రమున, ఆ నగర మొకప్పుడు విజయమునకుఁ బుట్టినిల్లు. విద్యల కొటపట్టు, సర్వకళలు సమోన్నతముగా మూర్తీభవించిన రాయల కళాకాంతు లీ క్షేత్రమున జీర్ణించినవి. కత్తి-కలము సమానముగా వివిధ భూమికలలో విజృంభింపఁజేసిన వీరాగ్రేసరుఁ డాంధ్రభోజుఁడు. విజయనగర రాజుల శిల్పకళాభిరుచికి హంపీక్షేత్రము శాశ్వత తార్కాణము. ఆ క్షేత్రమునందలి ప్రతి శిలయుఁ బలుకును. ప్రతిభాగము చరిత్రాంకితమైనది. భావనా హృదయమున్న మానవునితో నీక్షేత్రము నోరువిప్పి మాటాడును. ఒక్కొక్క భాగమందు గర్భితమైయున్న సన్నివేశము మనలను పులకితగాత్రులను జేయును. ఈ క్షేత్రమువలన నచ్చటి ప్రకృతికే రామణీయకత చేకూరినది. ఈ క్షేత్రమునఁ గళ ఖండఖండములుగా గంభీరముద్ర వహించి, యోగనిద్రలో నున్నట్లగుపించును. దాని ప్రాచీనగాథ యొక కన్నీటిపాట. మతవిభేదములమాని, శిల్పకళకే ప్రాధాన్యమొసఁగిన దేవాలయము లచ్చటచ్చట నేఁడు శత్రు సమ్మెటలపాలై చెన్నుదఱిఁగినను, చెదరిన భాగములు వినూత్న సౌందర్యము నాపాదింప రామణీయకముగ శోభిల్లుచున్నవి. రాయలు- మదకరీంద్రము డిగ్గి, కేలూఁతయొసఁగి యెక్కించుకొన్న అల్లసాని పెద్దనాది అష్ట దిగ్గజములు వెలసిన క్షేత్రము. వారి కావ్య సృష్టికిఁ బ్రేరణాత్మక మీ విద్యానగరము.

ప్రాచీను లొనర్చిన కళాసేవకు మన మెంతేని ఋణపడియున్నాము. వారికి మనము కృతజ్ఞులము. వారి వైభవోన్నతికిఁ జిహ్నములుగా దేశమందు నల్గడల నిట్టి కళాక్షేత్రములు నిల్చియున్నవి.

విద్యార్థులు, విజ్ఞాన కళాభిమానులు కేవల గ్రంథ పరిచయముతోఁ దదున్నతిఁ బడయఁజాలరు. విజ్ఞానపరాకాష్ఠ నొందజాలరు. గ్రంథముల మూలమున విద్యార్థులు తమ మనోవీథులయందు సృష్టించుకొన్న భావనాసంపద, శ్రవణరూపమున సేకరించుకొన్న విషయ బాహుళ్యత, ఛాయారూపమున నస్పష్టముగా, అశాశ్వతముగా నుండునే కాని, పదిలమై, దృఢమైన భావనైర్మల్యత చేకూరదు. సిద్ధాంతరూపమున గ్రహించిన భావములు ప్రయోగసిద్ధిచేఁ బరిపక్వమునొంది, పదిలపడును.

కళాక్షేత్రములు, విద్యార్థులు సేకరించిన భావనా సిద్ధాంతములయొక్క ప్రయోగసిద్ధికి దోహదమొసఁగును. విజ్ఞానము యాత్రలమూలమున విస్తృతిగాంచును. కాశ్మీరము ప్రకృతికిఁ బుట్టినిల్లని పర్యాటకులు వర్ణించుట- ఒక పర్యాయము సందర్శించుటతో సాదృశ్యము కాఁజాలదు. సూర్యోదయాస్తమయ వర్ణన లెన్ని

పఠించినను- ఒకపర్యాయము మా దృశ్యము వీక్షించుటతో సరిగాదు. కావునఁ గన్ను లయందుఁ బ్రతిబింబితమైన దృశ్యము మనోవీథులకు నేరుగాఁ బయనించును.

పాఠశాలావరణములోని సంకుచితవలయమునందు సిద్ధాంతరూపమున విద్యార్థు లెంత గ్రహించినను అది వారికి సుబోధకమై, సుస్థిరతఁ గాంచజాలదు.

కావున ఈ ప్రాధాన్యతను గుర్తెఱిఁగియే ప్రభుత్వమువారు సైత మిట్టి కళాక్షేత్రములకు విద్యార్థులు విజ్ఞానయాత్ర సల్పుట నిర్బంధమైన యొక ప్రధాన పాఠ్యాంశముగా నియమించిరి. ఇట్టి విజ్ఞానయాత్రలచే విద్యార్థుల భావనాశక్తి యతిశయించును. మనస్సు 'కెమెరా'వంటిది. అందు '*Negative*' రూపమున నేర్పడిన భావనా ప్రతిబింబములకు '*Positive*' రూప మొసఁగి, సుస్పష్టముచేయు నీ విజ్ఞానయాత్రలు. శిల్ప మొక విజ్ఞానము. ఈ కళాక్షేత్రములయందు శిల్పము గ్రంథస్థమగు విజ్ఞానము ప్రకృతిలోఁ బొత్తుగలిపి రాణించుచున్నవి.

భావనావేశపూరితములైనవానిని దర్శించి విజ్ఞానాభివృద్ధినిఁ బెంపొందించుకొని సుస్థిరమైన మనోబలమును గాంచు టెంతయు నభిలషణీయము. గర్వకారణమైన ప్రాచీనుల వైభవోన్నతినిఁ బ్రకటించువారి శిల్పకళా నైపుణ్యమునకు మన జోహారులు.

హంపీక్షేత్రమును, అందలి పరిశిష్టములనుగూర్చిన చారిత్రక విషయములను నా యోపినకొలఁది సేకరించి, నేనీ పొత్తమును రచించితిని. ఈ గ్రంథనిర్మాణమున నా కత్యంతము సాయపడిన గ్రంథము లివి:

1. Hampi Ruins — A. H. Longhurst
2. A Guide to Hampi and Vijayanagar

— H. K. NARASIMHASWAMY

3. పంపామాహాత్మ్య సంగ్రహము- కె. వేంకటరామశాస్త్రి.
4. విద్యానగర చరిత్రము- సీరిపి ఆంజనేయులు.

ఏతత్కృతికర్తల ఋణమును ధన్యవాదములతోఁ దీర్చికొందును.

న న్నీ పుస్తకము వ్రాయ నత్యంతము ప్రోత్సహించి, సర్వవిధములఁ దోడ్పడిన మన్మిత్రులగు శ్రీ జానపాటి సీతారామశాస్త్రిగారికిని, శ్రీ టి. రామప్పగారికిని శ్రీ బి. వ్యాసమూర్తిగారికిని నా కృతజ్ఞతాభివందనములు.

కోరుటయె తడవుగా నీ గ్రంథమును సమగ్రముగఁ బరిశీలించి, యమూల్యమైన తొలిపలుకును వ్రాసియిచ్చిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి నా నమస్కృతులు.

ఇండియా ప్రభుత్వమువారు ప్రచురించిన గ్రంథము (*Hampi Ruins*) లోని పటములను దిమ్మెలు (*Blocks*) చేయించుకొని నా యీ పుస్తకమున ముద్రించుకొన ననుజ్ఞ యొసఁగిన డైరెక్టర్ జనరల్ ఆఫ్ ఆర్కియాలజీ ఇన్ ఇండియా (*Director General of Archaeology in India*) వారికి నా నమస్సులు.

ఇందలి పంపాసరోవర పటము ధారవాడయందలి శ్రీనివాస మరియు కంపెనీ వారు ప్రచురించిన 'సచిత్ర విజయనగర' మను పుస్తకము నుండి సేకరింపఁబడినది. వారి మేలును నే మఱువఁజాలను.

ఈ గ్రంథము నత్యంత సుందరముగ ముద్రించి, యాంధ్రలోకమున కర్పించిన మెసర్స్ అజంతా పబ్లిషింగ్ హౌస్ వారికి నా యైదు పదులు.

— రచయిత

# తొలిపలుకు

విజయనగరము క్రీస్తుశకము పదునాలుగవశతాబ్దియందు తుంగభద్రాతీరమున శ్రీ పంపావిరూపాక్షక్షేత్రమున వెలసిన నగరరాజము. మహమ్మదీయ దాస్య శృంఖలములను తెగత్రెంచివైచి హిందువులు పునః తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యములను బాదుకొల్పినందుకు విజయసంకేతముగ ప్రతిష్ఠించిన హిందూ కీర్తిస్తంభము విజయనగరము. విజయనగరము మధ్యయుగమునాఁటి హిందూపునరుద్ధరణపతాక. దక్షిణాపథీయులైన హిందువులు విజయనగరాధినేతల నాయకత్వమున విజయనగరరాజ్యమును నలుదెసల విస్తరింపఁజేసి దానికి సామ్రాజ్యగౌరవము నొడఁగూర్చిరి.

విజయనగరసామ్రాజ్య చారిత్రము ఒక విస్మృతగాథ. ఆ చారిత్రము ఒడలు పులకలెత్తించు వీరరస పరిప్లుతములగు అనేక దివ్యఘట్టములతోఁ గూడిన మనోహరమయిన ఒక కట్టుకథవంటిది. విజయనగరరాజ్య ఉదయము యెంతటి విస్మయముగొలుపువృత్తాంతమో, విజయనగరసామ్రాజ్య అస్తమయము అంతటి విషాదాంచితమయిన వీరకథానకము. హిందూరాజ్యములను పెల్లగించివైచి, సామ్రాజ్యములను కూలఁద్రోసి ఉప్పెనవలె దక్షిణదేశమును ముంచెత్తవచ్చుచుండిన ఇస్లాము మతముధాటికి హిందూసంస్కృతి-సభ్యతలు విలయముకొకుండ దక్షిణాపథ హిందూ ప్రతిభ వాటికి నిర్మించిన మహాసేతువు విజయనగరసామ్రాజ్యము. ఆంధ్రులు, కర్ణాటులు, తమిళులు అను జాతివివక్షత లేకుండ అందరును చెయిచేయి కలిపి హిందూ ధర్మమునందు లక్ష్యముంచి హిందూరాజ్యరమకు విజయనగర మను సప్తప్రాకారాంచితమయిన మహాదుర్గరాజమును నిర్మించినారు. వింధ్యకు దక్షిణమునఁ గల హిందూ జగతి నంతను యేకచ్ఛత్రముక్రిందికిఁ దీసికొనివచ్చి మహారాజాధిరాజులై నిర్వక్ర పరాక్రమముతో రాజ్యమేలినవారు విజయనగరాధీశ్వరులు. 'భాషెగె తప్పు వరాయరగండ'లైన వీరి బావుటా సింహాళమునందలి కోటకొత్తళములపైనికూడ రెపరెపలాడినది.

శ్రీ విద్యారణ్య భగవత్పాదుల మంత్రశక్తి కారణముగ రేకెత్తి ఆ మహాతపోధనుని ఆశీస్సహస్రప్రభావమున వర్ధిల్లి విస్తరిల్లినది యీ విజయనగర మహాసామ్రాజ్యము. దీనిని బరిపాలించిన యాదవ, సాళువ, తుళువ, ఆరవీటి వంశజులైన రాజేంద్రు లందరు హిందూధర్మ నిబద్ధబుద్ధులు; స్వమతాభినిరతులు. ఆ మహారాజాధిరాజుల పోషణ, ప్రాపకముల హిందూమతసాంప్రదాయములైన శైవ, వైష్ణవములు రెండును ఒకదాని నొకటి తలదన్ని వర్ధిల్లినవి. రాజధానియైన విజయనగరము ప్రధానముగ శైవ, వైష్ణవ దేవధామములతో దివ్యసీమగా తేజరిల్లినది. ఒకటా, రెండా—ఇందలి దేవాలయములు—అడుగడుగునను దేవాలయములే, దివ్యక్షేత్రములే, దివ్యతీర్థములే; విజయనగరము దివ్యస్థలము; అనల్పశిల్పకళాసుందరములైన దేవహర్మ్యగోపురముల కనికిపట్టు. రాజప్రాసాదములతో, దేవాలయములతో, ఉన్నతములయిన గోపురములతో, క్రీడాసరోవరములతో, ఉపవనారామవాటికలతో

విజయనగరము మహేంద్రనగర వైభవమును క్రిందుపఱుచుచుండెను. హిందూసంస్కృతికి అంగరక్షయై దానిని విజయనగరసామ్రాజ్యము సాకిననాఁడు ఆ నగరరాజము నందలి పౌరజీవనము సంగీతసాహిత్య శోభావిదగ్ధమయి, సంధ్యాకాల మహా నటరాజ లీలానాట్యార్భటివలె చతుర లయానుబద్ధప్రకర్షకమయి ప్రావృట్కాలమునందలి తుంగభద్రాస్రవంతినిబోలి పొంగులు తేలుచు, సుడులు తిరుగుచు గడచిపోయినది. ఆనాఁటి జీవనవర్తనపు లయానుగతులు నేఁటికిని విజయనగరమున ప్రాచీనవైభవ స్మారకచిహ్నములుగ నిలిచియున్న దేవాలయనిర్మాణ శిల్పపంక్తులలోఁ గాంచఁగలము.

విజయనగరసామ్రాజ్యయుగము మన చరిత్రమున కడు ప్రధానమయినది. విదేశాగతులైన యూరోపియనులు వర్తకవ్యాపారమును బురస్కరించుకొనో, మఱి యే హేతువుచేతనో తండోపతండములుగ నేతెంచి విజయనగరసామ్రాజ్యమునఁ దమ సంస్కృతి-సభ్యతలకు పాదులుకట్టుచుండిన కాలమది. ఇస్లాముమతప్రభావము విజయనగర హిందూసంస్కృతిపై ముద్రపడిన కాలమది. రాజకీయాధికారసమస్యలు హిందూ, ముస్లిం రాజకుటుంబములను ఆనాఁటి కానాఁడు వేఱుపఱచి యొండొంటికి మఱింత దూరముచేయుచు వచ్చినను హిందువులును మహమ్మదీయులును ఆర్థికములైన పరిస్థితులవలన ఒకరిరాజ్యమున మఱియొకరు వసించి, యొకరి కొలువున మఱియొకరు కుదిరి పొంది పొసగియుండి సాంఘికసామరస్యమునకు, పరస్పర సంస్కృతి సభ్యతాసమ్మేళనమునకు దారిచూపిన కాలమును అదియే. సంఘ పురోగమనవేగమునకు దీటుగ రాచఱికమున మార్పురాలేదు. సంఘము దినదినమునకు మాఱుచువచ్చుచున్నను విజయనగరాధీశ్వరు లవలంబించిన సాంఘిక, మత, రాజకీయ నీతినియమములు మాత్రము కడు ప్రాతవై చేవచెడి బూజుకట్టినవి. తుదకు సంఘమును నడిపినవారిలో, రాజ్యచక్రమును ద్రిప్పినవారిలో శతాబ్దివెనుక శతాబ్ది గడవఁగా దూరదృష్టియు, మంత్రశక్తియు కొఱవడిపోయినవి. ఈకారణమున రాను రాను విజయనగరసామ్రాజ్యమున అది యుదయించిననాఁటి ప్రశస్త భావలక్ష్యము లుప్తమై ఆచారాభ్యాస వాసనావిలసితమైన కార్యకలాపభార మధికమైనది. దేశీయమునకు-విదేశీయమునకు, ప్రాచీనమునకు-నవీనమునకు, స్వమతాచారనిరతికి-పరమతాచార ప్రభావమునకు, జాతీయదృష్టికి - విజాతీయదృష్టికి, మతనైష్ఠికతకు - సాంఘిక స్వేచ్ఛానుభోగలాలసతకు, వ్యక్తికి - సంఘమునకు, అగ్రవర్ణములకు - కడవర్ణములకు, కుడిచేతికులములవారికి - ఎడమచేతికులములవారికి—ఇంత యెందుకు ఒక్క విషయమునఁగాదు, ఒక్క రంగమునఁగాదు—సంఘర్షణము ప్రబలినది. చివరకి విజయనగరసామ్రాజ్యము బహు జాతి-మతప్రభావమునకు, వివిధ సంస్కృతీవైవిధ్యమునకు గుఱియై, తద్రాజ్యతంత్రము బహుముఖసమస్యాబహుళమైనది. సంఘమున, మతమున, రాజకీయమున, ఆర్థికమున అన్నియు సమస్యలే. ఈ సమస్యలలో, ఈ సంఘర్షణములలో, సనాతన ధర్మాచార సంప్రదాయబలము ఈ విజయనగరసామ్రాజ్యచక్రమును ముందుకు తిరుగకుండ ఒడిసిపట్టి దానిని నిలువరింపఁగా నూతనదృక్పథ, సంఘర్షణ ప్రభావవేగము బలవంతముగ ముందుకు నెట్టి దానిని త్రిప్పఁజొచ్చినది. పరస్పర విరుద్ధములయిన

యీ శక్తుల హాళాహాళికి తాళలేక విజయనగరసామ్రాజ్యము బీటలువాఱి చితికి చిద్రుపలై అంతరించిపోయినది. ఇక మన కిప్పుడు మిగిలినవెల్ల వైరివీరుల దుండగములకు, కాలపురుషుని విధ్వంసకచర్యకు పాల్పడియు నామమాత్రావశిష్టములై, భగ్నావశిష్టములై యున్న విజయనగర రాజభవనాలయాది శిథిలములే— నేఁడు హంపీ శిథిలములని వీటికి వ్యవహారము.

ఈ శిథిల నిర్మాణావశేషములు యిన్ని యన్ని కావు; అనేకములు. వీటిని జూచుటకు కొన్ని నాళ్ళు బట్టును; మఱి పూర్వ మది మహానగరరాజము. గాలిలోఁ బెట్టిన కర్పూరఖండమువలె ఆ నగరరాజవైభవము హరించిపోయినది. నేఁడు పాడువడి బీడువడిన యీ శిథిలాలయక్షేత్రము ప్రతి యాంధ్రుఁడును సందర్శింపవలసిన యాత్రాస్థలము. ఈ హంపీ శిథిలములలో సంచరించుచున్నప్పుడు మన స్వత్వ మేదియో పోయిన ట్లనిపించి, ఎన్నెన్నో ప్రాచీన గాథాస్మృతులు జ్ఞప్తికిరాఁగా హృదయము విస్మయ, విషాదములతో ఆకులమై కనులు చెమ్మగిల్లుచుండును. ఆ స్థలము మహత్తు అటువంటిది.

గ్రంథకర్త అయిన శ్రీ నూతలపాటి పేరరాజుగారు యీ గ్రంథమును రచియించి యీ హంపీశిథిలములను జూడఁదలచిన చారిత్రకయాత్రికులకు గొప్ప యుపకారము చేసినారు. ఇందు యీ సామ్రాజ్యచారిత్రమును, శిథిలముల చారిత్రమును విశదీకరింపఁబడినవి. ఈ హంపీ శిథిలములనుగుఱించి తెలుపు నీ గ్రంథము రెండవది. ఇదివరకు "A Guide to Hampi and Vijayanagar" అను పేర ఇంగ్లీషులోనున్న గ్రంథముననుసరించి శ్రీ హెచ్. కె. నరసింహస్వామి, B. SC. గారు తెలుఁగున 1941 లో ఒక పుస్తకమును వ్రాసినారు. ఇది గవర్నమెంటువారిచేతఁ బ్రకటితము. ఈ రెండుపుస్తకములకుఁగల భేద మిది— శ్రీ పేరరాజుగారు కమలాపుర, కాంపిల్య, అంతఃపురావరణ, పంపాపుర, ఆనెగొంది, తలారిగట్టు మార్గములను ఒక్కొక్కదానిని విడివిడిగా తీసికొని, ఆ మార్గములఁ బోవునప్పుడు యాత్రికునికి కనడఁబడు శిథిలావశేషముల చరిత్రము నభివర్ణించుచు వచ్చినారు. ఈ గ్రంథమును దగ్గరుంచుకొని యే యాత్రికుడైనను యితరసాహాయ్యము లేకయే హంపి-విజయనగర శిథిలముల నన్నింటిని సాకల్యముగఁ జూచి వాటిని గుఱించి తెలిసికొనవచ్చును. ఇదికూడ పై నుడివిన ఇంగ్లీషుగ్రంథము ననుసరించి వ్రాసినదేయైనను యిందు గ్రంథకర్తగారు హంపీశిథిలములను చక్కఁగాఁ జూచి చారిత్రకవిషయములను తెలిసికొని గడించిన విజ్ఞానానుభవము కొంత కన్పట్టుచున్నది. ఇట్టి గ్రంథము లెన్నివచ్చినను అవి యాంధ్రభాషకు అమూల్యాలంకారములే !

ఈ గ్రంథకర్తగారు యింకను యిట్టిగ్రంథములను రచియించి ఆంధ్రలోకమునకు సేవచేయఁగలరని యాశించెదను.

గుంటూరు,
తారణ, మాఘ శు 2 శనివారం

— మల్లంపల్లి సోమశేఖరశర్మ.

# విషయసూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము

నేల మాళిగ
ఆస్థానమంటపము
రాతి తొట్టి
హజార రామాలయము
టంకసాల
దండనాయకుని కోట
అంతఃపురావరణము
గజశాల
భటశాల
రంగస్వామిదేవాలయము
దఫ్తర్ ఖానా
పట్టాణద ఎల్లమ్మగుడి
ఒంటిగుండు పడసాల

పంపాపుర మార్గము

భూగర్భదేవాలయము
అక్క సెల్లెండ్ర గుండ్లు
ఉద్దాన వీరభద్రుని గుడి
సహగమన చిహ్నములు
తురుత్తు కాలువ
నృసింహ విగ్రహము
బడివేలింగము
కృష్ణస్వామిఆలయము
చిన్నని విష్ణాలయము
సాసివికాళు గణేశ విగ్రహము
కడలెకాళు గణేశాలయము
హేమకూట పర్వతము
శివరామావధూతాశ్రమము
కాశీ విశ్వనాథాలయము
జైనబసదులు
పంపాపతి దేవాలయము
పంపాపురవీధి
నంది విగ్రహము

తలారిగట్టు మార్గము

కోదండరామస్వామిదేవాలయము
చక్రతీర్థము

## ఆనెగొంది మార్గము

# ఇందలి చిత్రముల పట్టి



---

# విజయనగరరాజుల సంగ్రహచరిత్ర

సంగమవంశము

సాళువవంశము

తుళువవంశము

ఆర్వీటివంశము

# విదేశయాత్రికుల వర్ణనము
# విజయనగర వైభవము

(i) అబ్దుర్ రజాక్ (Abdur Razzak)

(ii) పెయిస్ (Domingos paes)

# విజయనగరరాజుల సంగ్రహచరిత్ర

విజయనగరము (హంపి) నందలి శిథిలములనుగూర్చి తెలిసికొనుటకుముందు ఆ సామ్రాజ్యస్థాపనయు, దానిని పాలించిన రాజుల యొక్కయుఁ జరిత్రములు తెలిసికొనుట మంచిది. ఏలన—విజయనగరమునందలి పరిశిష్టములన్నియు నా రాజులు నిర్మించిన కట్టడములకు సంబంధించినవే.

చాళుక్యరాజ్య మంతరించునప్పటికి నా సామ్రాజ్యపు టుత్తర భాగమును దేవగిరి యాదవులును, దక్షిణభాగమును ద్వారసముద్రపు హొయ్సళులును, పూర్వభాగమును నోరుగంటి కాకతీయులును నాక్రమించిరి. ఈవిధముగాఁ జాళుక్యుల పాలనమునకు లోఁబడిన రాజ్యమంతయు చిన్నాభిన్నమై వేర్వేఱురాజుల హస్తగత మాయెను. దేవగిరి యాదవులు హొయ్సళులతో భీకర సంగ్రామములు గావించుచు వారి రాజ్యపు టుత్తరభాగమును నాక్రమించి, శివమొగ్గమండలములోఁ దమ సామ్రాజ్యసూచకముగా యశఃపతాకమును నిలిపిరి. ఆకాలమున బళ్ళారిమండలములోని హొసపేటప్రాంత మెవరిపాలనమునకు లోఁబడియుండెనో నిర్ణయించుటకుఁ దగిన ప్రమాణములు గానరావు. హొయ్సళాధిపతులైన రెండవ వీరబల్లాల, సోమేశ్వర, రామనాథుల శిలాశాసనములు హంపియందును, దానికిఁ బరిసర గ్రామములందు లభించినను, మూఁడవ బల్లాలుని శాసనము లెవ్వియు నీ ప్రదేశమున నింతవరకును గనఁబడకున్నవి. ఆకాలమున రాజకీయ పరిస్థితులు చాలవరకుఁ దాఱుమాఱుగ నుండుటయే దీనికిఁ గారణమని యూహింపవలసియున్నది. కాని, యాదవరాజ్యమునకుఁ జేరియుండిన యనంతపురమండలములోని కొన్ని ప్రదేశములం దితని శాసనములు గానవచ్చుచున్నవి. మఱియు దక్షిణమున హొయ్సళ రాజ్యమునఁ జేరియుండు హావేరి, రాణిబెన్నూరు, శివమొగ్గ ప్రాంతములందు యాదవసింగణ, మహాదేవ, రామచంద్రుల శాసనములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఇది కారణముగ యాదవ హొయ్సళులు లొండొరులతో ఘోరముగఁ బోరుచుండిరని తెల్లమగుచున్నది.

కాని, హోసపేట ప్రాంతమునం దీ రాజుల శాసనము లెచ్చటను గనc బడనికారణమున నీ ప్రదేశ మెవరిపాలనకు లోcబడియుండెనో తెలియ కున్నది. హంపియందును, శివమొగ్గ, తుముకూరు, హోవేరి తాలూకాలయందును నీకాలమున మున్ముడి సింగయనాయకునియొక్కయు, నాతని కుమారుcడగు కంపిలరాయనియొక్కయు శిలాశాసనములు వెలువడియున్నవి. కావున వీ రీ ప్రాంతమున స్వాతంత్ర్యము సంపాదించి పాలించుచుండిరని తోcచుచున్నది. సకల మాండలికరాజులను దనకు వశపరచుకొని స్వాతంత్ర్యభేరిని మ్రోయించిన యాదవ రామచంద్రుcడు సింగయనాయకునిcగూడ లోcబఱచుకొనెను. సింగయ నాయకుని మరణానంతర మాతని తనయుcడు కంపిలరాయcడు రామ చంద్రుని మాండలికుcడుగా నుండినట్లు శాసనములు దెలుపుచున్నవి.

"ఇది యిట్లుండ, ఢిల్లీసుల్తానైన అల్లావుద్దీన్ ఖిల్జీ తన సేనాధి పతియైన మలిక్ కాఫురును హిందూరాజులను స్వాధీనము గావించు కొన నొక సైన్యమిచ్చి దక్షిణదేశముపైc బంపెను. మలిక్ కాఫురు యాదవ రామచంద్రుని జయించి, కాకతీయ ప్రతాపరుద్రుని నోడించి వారిని సుల్తానునకు నియమింపcబడిన కప్పము కట్టునట్లొడcబఱచి మరలెను. ఇది జరిగిన కొంతకాలమున కాతcడు హొయ్సళబళ్ళాలుని నోడించి, యాతనిని సుల్తానున కంకితునిc గావించెను. తమ పరాక్రమాతిశయమున నెవరిని లక్ష్యపెట్టక, తమ యేలుబడిని దక్షిణాపథమున స్థిరముగ నిలుపవలెనను సంకల్పముగల కంపిలరాయ కుమార రామనాథులను ఢిల్లీసుల్తానగు మహమ్మదు తుఘ్లకు యుద్ధమునందుc జంపించి, వారిరాజ్యమును జూఱగొనెను. ఇట్లు—యాదవ, హొయ్సళ, కాకతీయరాజులయొక్కయుc, గంపిలరాయ కుమార రామనాథుల యొక్కయు నవసానకాలమునకు దక్షిణాపథమంతయు మహమ్మదీయ మయము కాcజొచ్చెను. నానాcటికి మహమ్మదీయుల బలము ప్రబల మగుచుండెను. ఇట్టి తరుణమున, దైవయోగమున, సుల్తానునకును నాతని దండనాథులకును దాము జయించిన రాజ్యభాగ విషయమునc దీవ్రకలహము లేర్పడి, చివరకు, దండనాథు లందఱుc దమ యిచ్ఛ

చొప్పున స్వతంత్రరాజ్యముల నేర్పఱచుకొనఁ దొడఁగిరి. ఇట్టి యవకాశమును బురస్కరించుకొని, తలయెత్తుటకై వేచియున్న హిందూ మాండలికులు దాము గోలుపోయిన స్వాతంత్ర్యమును సంపాదింపఁ బ్రయత్నించిరి. ఆ కాలమునఁ గంపిలరాయని యాస్థానమున భాండాగారాధ్యక్షులుగా నుండిన హరిహరరాయలును, బుక్కరాయలును సైన్యమును గూర్చుకొని స్వాతంత్ర్యమును బ్రకటించి, కంపిలరాయని రాజధానియగు నానెగొందియందు స్వతంత్రరాజ్యమును స్థాపించిరి. ఆమీఁద నా యన్నదమ్ము లిరువురు విజయ యాత్రలు సాగించి, రాజ్యమును విస్తృతమొనర్చి గురువరేణ్యులగు విద్యారణ్యుల యాజ్ఞమెయి హంపిగ్రామమును దీర్చికట్టి దానికి 'విద్యానగర'మని పేరు పెట్టి, తమ రాజధానీనగరముగఁ జేసికొనిరి."*

విజయనగర సామ్రాజ్యమును సంగమ, సాళువ, తుళువ, ఆర్వీటి వంశములవారు పాలించిరి. సంగమవంశము మొదలు తుళువ వంశపు రాజైన సదాశివరాయలు గద్దియ నెక్కువఱకును విజయనగరము సామ్రాజ్యమునకు రాజధానీనగరముగ నుండెను. ఆమీఁదఁ గ్రమముగ పెనుగొండ, చంద్రగిరి, వేలూరులు రాజధానీ నగరములాయెను.

(i) సంగమవంశము :

విజయనగర సామ్రాజ్య స్థాపకుఁడైన హరిహరరాయలు సంగమ వంశజుఁడు. ఈ వంశమువారు 1336 మొదలు 1486 వరకు సామ్రాజ్యమును బాలించిరి. వీరి మూలపురుషుఁడు సంగముఁడు. వీరు యదువంశ సంజాతులు; శైవులు. కులదైవము పంపాపతియైన విరూపాక్షుఁడు. ఈ వంశజులలోఁ గొంద ఱీ దేవుని నామమునే ధరించిరి. దానశాసనములందు సహిత మీ దేవుని నామమునే సంతకముగ వాడిరి. వీరి నాణెములందుఁ బార్వతీపరమేశ్వరుల బింబము లొత్తింపఁబడియున్నవి. వీరి లాంఛనము వరాహము.

---

* A Guide to Humpi and Vijayanagar, Pages 9-11.

ఈ వంశేపు రాజులలో మూఁడవవాఁడగు రెండవ హరిహర రాయల (1377–1404) కాలమున రాజ్యము విస్తృతమై, రెండవ (ప్రౌఢ) దేవరాయల (1423–1447) కాలమున ఘనత కెక్కెను. విజయ నగరపు ప్రఖ్యాతి దక్షిణమునఁ గావేరీతటమును దరించు టీకాక, తూర్పునఁ దెలింగాణ మంతటను వ్యాపించినది. ఉత్తరదిశనున్న యాదవరాజ్యముయొక్క దక్షిణభాగము వీరివశమైనది. ఇంతటి విశాల సామ్రాజ్యమును విజయనగరాధీశులు మాండలికుల మూలమునఁ బాలించుచుండిరి. కొంతకాలమున కీ వంశమునందు రాజపదవికొఱకు నంతఃకలహము లేర్పడ మొదలిడెను. ఈ వంశమునందుఁ గడపటి వాఁడగు విరూపాక్షరాయల (1465—1485) కాలమున నీ వంశ పరాక్రమ మంతరించినది.

(ii) సాళువవంశము :

విరూపాక్షరాయలకు రాజశేఖరరాయలు, ప్రౌఢదేవరాయలు నను నిరువురు కొడుకులుండిరి. ప్రౌఢదేవరాయ లసమర్థుఁడగుటవలన నాతని సేనానాయకులలోఁ బ్రసిద్ధుఁడైన సాళువ నరసింహరాజతనిని రాజ్యమునుండి తొలఁగించి, తానా సింహాసన మధిష్ఠించెను.

ఈ వంశమువారు చంద్రవంశజులు. మూలపురుషుఁడు గుండ దేవుఁడు. వీరికి వరాహచిహ్నముగల ధ్వజముకలదు. కటారి ప్రధా నాయుధము. కావున వీరు 'కఠారరాయ' 'ధరణీవరాహ' బిరుదములచే విరాజిల్లిరి. వీరు వైష్ణవమతావలంబకులు. ఈవంశజులు 1486 మొదలు 1505 వఱకు విజయనగరసామ్రాజ్యమును బాలించిరి.

(iii) తుళువవంశము :

సాళువ నరసింహరాయలకడఁ దుళువ నరసరాజు మంత్రిగ నుండెను. నరసింహరాయల రెండవ కొమరుఁడగు ఇమ్మడి నరసింహ రాయలు మూర్ఖుఁడై, రాజ్యకార్యములయందు విముఖుఁడై యుండఁగా నాతనిని పెనుగొండదుర్గమున బంధించి, తుళువ నరసరాజు రాజ్య మును స్వాధీనపఱచుకొనెను.

తుళువ వంశపురాజులు 1505 మొదలు 1568 వఱకు రాజ్యమును పాలించిరి. వీరు చంద్రవంశజులు. ఇది యయాతి పుత్త్రుఁడైన తుర్వసుని వంశమగుటచేఁ దీనికిఁ దుళువవంశమని పేరుగలిగెను. నరస రాజు కుమారులలోఁ బెద్దవాఁడగు వీరనరసింహరాయలు వ్యాసరాయ స్వామివలన వైష్ణవదీక్షను బొందినట్లు 'వ్యాసయోగిచరితము' వలనఁ దెలియుచున్నది. ఈతని మరణానంతర మితని తమ్ముఁడైన కృష్ణదేవ రాయలును, అచ్యుతదేవరాయలును నొకరివెనుక నొకరు సింహాసన మలంకరించిరి. కృష్ణదేవరాయల కాలమున విజయనగర సామ్రాజ్యము మిక్కిలి ఘనతఁగాంచి, విజృంభించినది. ఇతఁడు మైసూరు ప్రాంత మందలి శ్రీరంగపట్టణము, శివసముద్రములయందలి కోటలను ముట్టడించి, స్వాధీనపరచుకొని, యామీఁద నెల్లూరుమండలములోని యుదయగిరి దుర్గమును గైవసముచేసికొనెను. అటుపిమ్మట నీతఁడు గుంటూరుమండలములోని కొండవీటిని, కృష్ణామండలములోని కొండపల్లిని వశపరచుకొని, రాజమహేంద్రవరమును గొల్లగొనెను. తరువాత, రాయచూరుకోటను ముట్టడించి, బిజాపూరు సుల్తానునకు లోఁబడియుండిన కృష్ణా, తుంగభద్రా స్రవంతుల మధ్యప్రదేశమును స్వాధీనపరచుకొనెను. ఈతని కాలమున విజయనగర సామ్రాజ్యము తూర్పున నోఢ్రదేశమందలి కటకమువరకును, బశ్చిమమున బొంబాయికినుత్తరమునసుండు సాల్సెట్టిద్వీపములవరకును విస్తరించియుండెను. దక్షిణమున సింహళద్వీపమువరకు నితఁడు దిగ్విజయ మొనర్చెనని యితని యరవశాసనములలోఁ బేర్కొనఁబడిన 'ఈళన్దిరై గొండ' యను బిరుదము సూచించుచున్నది. తరువాత, సింహాసనమెక్కిన వాఁ డచ్యుతదేవరాయలు. ఇతని కాలమున రాజ్యతంత్ర సూత్రముల బలము తగ్గినది.

(iv) ఆర్వీటివంశము :

కృష్ణదేవరాయల యల్లుఁడైన రామరాజును, నాతని తమ్ములైన తిరుమల వేంకటాద్రులును ప్రబలులైరి. రామరాజు అచ్యుత దేవరాయల నణఁగఁద్రొక్కి, తానే రాజ్యభారము వహించెను.

అచ్యుతుని యనంతరము పట్టణమునకు వచ్చిన సదాశివుని కాలము నందు రామరాజు చాతుర్యము మెఱయ మహమ్మదీయ రాజులలోఁ బరస్పర కలహములు గల్పించి, తన రాజ్యమును స్థిరపఱచుకొనెను. తాను, అహమదునగరము, గోల్కొండరాజుల పక్ష మవలంబించి, బిజాపూర్ ఆదిల్ శాహులపై దండెత్తి వెడలి, ముదగల్, రాయచూరు మొదలగు ప్రదేశములను స్వాధీనపఱచుకొనెను. కాలక్రమమున హిందూ మహమ్మదీయరాజులలో నంతఃకలహములు సంభవించి, నానాఁటికిఁ బ్రబలినవి. అంత, మహమ్మదీయరాజులందఱేకమై 1565 వ వత్సరమున రక్కసతంగడిగి రణరంగమున విజయనగరరాజు సైన్యముల నోడించి, విజయనగరమును స్వాధీనపరచుకొనిరి. దాన విజయనగరము నాశనమయ్యెనుగాని, సామ్రాజ్య మంతరింపలేదు.

రామరాజు ఆర్వీటివంశమునకుఁ జేరినవాఁడు. వీరు చంద్ర వంశజులు. మూలపురుషుఁడు తాత పిన్నమరాజు. ఈ వంశజులు 1569 మొదలు 1680 వరకు సామ్రాజ్యమును బాలించిరి.

రక్కసతంగడిగి యుద్ధానంతరము రామరాజు తమ్ముఁడగు తిరుమలరాజు పెనుగొండను రాజధానిగఁ జేసికొని, సదాశివరాయ లను ముందిడుకొని, తాన రాజ్యపాలనము సాగించుచుఁ దుదకు రాజా యెను. ఈ వంశపురాజులలో నొక్కరుఁడగు వేంకటపతిదేవరాయలు 1592 వ వత్సరమునఁ దన రాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చుకొనెను. పిమ్మట నాతఁడే 1606 వ వత్సరమున వేలూరిని రాజధానిగఁ జేసికొని పాలించెను. పెద్ద వేంకటపతిరాయల పరిపాలనా కాలమున నాతని సామంతుఁడైన దామర్ల వేంకటనాయకుఁడు 1639వ వత్సరమున ఈస్టిండియాకంపెనీవారికి చెన్నపట్టణమునఁ గోటను గట్టు కొనుటకుఁ గొంతభూమినిఁ గౌలునకిచ్చెను. కాలక్రమమున సామ్రా జ్యము క్షీణించి 1680 ప్రాంతమున వేంకటపతిరాయల కాలమున సంపూర్ణముగ నశించెను.

# విదేశయాత్రికుల వర్ణనము

క్రీ. శ. 1443 వ వత్సరమున అబ్దుర్‌రజాక్ అను నతఁడు విజయనగరమును జూడవచ్చి యానగరమును ఇట్లు వర్ణించియున్నాడు.

“1443 వ వత్సరము ఏప్రియల్ నెల చివరకు విజయనగరము ప్రవేశించితిమి. మమ్ముఁ దోడ్కొనిపోవుటకై మా కెదురుగాఁ బరివారజనమును బుత్తెంచి, మేము బసచేయుటకై, మాకొక సుందరమైన గృహము రాయ లిప్పించెను. ఆతనిరాష్ట్రము కృష్ణానది మొదలుకొని కన్యాకుమారి వరకు వ్యాపించియుండెను. ఆ నగరమున వికృతాకారములు గలిగి, పర్వతములను బోలిన యేనుఁగులు గలవు. పదునొకండు లక్షల సైన్యముకలదు. హిందూస్థానమునం దాకాలమున నిరంకుశాధికారముగల మరియొక రాయలు గానరాఁడు. విజయనగరము వంటి మహానగరము నెన్నఁడును మేము కన్నులతోఁ జూచియుండ లేదు. ఆ నగరమునుబోలిన మరియొక నగరము ప్రపంచమున నెచ్చోటనైన నున్నట్టు వినియుండలేదు. సప్తప్రాకారములచేతఁ జుట్టఁబడిన యేడు దుర్గములచే సురక్షితమై యానగర మొప్పుచున్నది. మొదటి దుర్గముచుట్టును నిలువెఁడెత్తుగల రాళ్ళు, గుఱ్ఱములుగాని, భటులుగాని నడచుటకు వీలులేనియట్లు భూమిలో సగమువరకుఁ బాదుకొనియున్నవి. ఉత్తరముగానున్న యేడవదుర్గమే రాజు నివసించు నంతఃపుర మందిరముగా నున్నది. మొదటి దుర్గముయొక్క దక్షిణపుకోన మొదలుకొని యుత్తరపు కొనవరకు దూర మెనిమిదిమైళ్ళుగా నుండెను. మొదటిదుర్గము మొదలుకొని మూఁడవ దుర్గమువరకుఁగల ప్రదేశమంతయు సాగుచేయఁబడిన పొలములతోడను, గృహములతోడను, నుద్యానవనములతోడను, ఫలవృక్షములతోడను నిండియుండెను. మూఁడవదుర్గము మొదలుకొని యేడవ దుర్గమువరకుఁ గల ప్రదేశమంతయు నసంఖ్యాకములగు జనసంఘములతోడ నిండి బజారులతో నొప్పుచుండెను రాజమందిరమునకు సమీపముగా నాలుగుబజారు లొకదానికొక టెదురుగా బారులు దీర్చియుండినవి. ఉత్తరమున రాయలమందిరముయొక్క ద్వారమంటపము గలదు.

'ప్రతి బజారునకుఁ బైని సొగసైన *తాళ్వారముతోఁ గూడిన యున్నతములైన కమానులు నిర్మింపఁబడినవి. అన్నిటికంటె రాయల యాస్థానమంటపము మిక్కిలి యెత్తుగానున్నది. బజారులు విశాలము లును, బొడువులును గలిగి రమణీయములై యుండినవి. గులాబిపూవు లంతట నమ్మఁబడుచున్నవి. ఆ ప్రజలు గులాబిపూవులను నాహారము కంటె నావశ్యకములయినవిగా భావించుచుండిరి. ముత్యములు, కెంపులు, నీలములు, వజ్రములు మొదలగునవి బహిరంగముగా బజారు లలో విక్రయింపఁబడుచున్నవి. ఈ ప్రదేశములందును, రాజాంతఃపుర ప్రదేశములందును నున్నగాఁ జాల గచ్చుచేయఁబడిన రాతిగోట్టముల గుండ కాలువలు పెక్కులు జలపూర్ణములై ప్రవహించుచున్నవి. రాయల సౌధద్వార మంటపమున కెడమభాగమున రాచనగరువలె నున్న దివానుఖానా యను మందిరముగలదు. దాని కెదురుగా నొక్క సభామంటపము గలదు. సభామంటపమునకుఁ జివర చోప్దారులు నిలువఁబడియుందురు. ఆ సభామంటప మధ్యమున దివాను కూరు చుండు పీఠముగలదు. అచట దివాను లేక దండనాయకుఁడు ప్రజల విజ్ఞాపనములను విమర్శించుచుండును. ఆతని తీర్పునకుఁ బై తీర్పులేదు. పనిముగించిన తరువాత దండనాయకుఁడు సప్తద్వారములను దాఁటి యంతఃపురము సొచ్చి, సమస్తమును రాజునకు నివేదించును. రాజ మందిరమునకు వెనుక దండనాయకుని గృహముకలదు. ఆ మందిర మున కెడమవైపున నాణెముల ముద్రించు టంకసాలగలదు. దివాను ఖానాకు నెదురుగా నేనుఁగులుండు కట్టడముకలదు. ఏనుఁగున కొక్కొక్క గదిచొప్పున నేర్పాటు చేయఁబడెను. నాణెములు ముద్రించు టంక సాల కెదురుగా నగరపాలకుని గృహముగలదు. ఆతనిక్రిందఁ బండ్రెండు వేల భటులుండిరి. టంకసాలకు వెనుకప్రక్క పదునైదుగజముల వెడ ల్పును, రెండువందల గజములు పొడవునుగల యొక చిన్నబజారు గలదు. బజారున కిరుపార్శ్వములయందు నిండ్లును, ముఖమంటపము లును గట్టబడియున్నవి. వాని కెదుట సొగసైన రాళ్ళచేఁ గట్టఁబడిన

---

* స్తంభములమీఁదికిదించిన చోవ.

యున్న తాసనములు గలవు. ఆ యా గదులయొక్క గోడలమీఁద సింహములు, పెద్దపులులు, చిఱుతపులులు మొదలగు క్రూరమృగములయొక్క యాకారములు చిత్రింపఁబడినవి. అక్కడి యున్నతాసనములు రత్నాభరణాలంకృతలగు వేశ్యాంగనామణులచే నధిష్ఠింపఁబడియుండినవి. ఒకనాఁడు నన్నుఁజూచుటకై రాయల యంతఃపురము నుండి పంపఁబడిన కొందఱు దూతలువచ్చి, యా దినముననే నన్ను రాయల యాస్థానమునకుఁ గొనిపోయిరి. రాజకుమారుఁడు (ప్రౌఢదేవరాయలు) సభామంటపమున రాజకార్యధురంధరులగు మంత్రిశిఖామణులు మొదలుగాఁ గలవారు తన్ను బలసికొలువ సింహాసనాధిష్ఠితుఁడై యుండెను. వాని కిరుప్రక్కల జనసంఘము వృత్తాకారముగ నిలువఁబడియుండెను. రాయలు పట్టుపీతాంబరమును ధరించియుండెను. ముత్యాలపతకమును, నమూల్యములగు రత్నాభరణములను ధరించి యుండెను. పలుచనైనట్టియుఁ, బొడవైనట్టియు దేహముగలిగి నలుపును దెలుపునుగాక, చామనచాయఁబోలు రూపమును గలిగియుండెను. చెక్కులు మెత్తనివై పలుచగనున్నవి.

'ఆతనికి గడ్డమున వెండ్రుకలులేవు. చూపు మనోహరముగా నుండెను. మహానవమి పండుగనాఁడు రాయలు తనరాష్ట్రములోనుండి తనకుఁ గప్పముగట్టుచున్న సేనాధిపతులను, ప్రభువులను దన యాస్థానమునకు రప్పించి, దర్బారుతీర్చెను. వారలు మిగుల రమణీయములగు హౌదాలతో నలంకరింపఁబడిన యేనుగులను వేయింటిని దమతోఁ గూడఁ దెచ్చిరి.

''ఆనాఁడు నగరమంతయు శృంగారముగా నలంకరింపఁబడెను. ఏనుఁగు లొకచోటునకుఁ జేరి, సముద్రతరంగములఁబోలి కనుపట్టుచుండెను. అచ్చటచ్చట నాలుగైదంతరువులుగల పందిరులు నిర్మింపఁబడినవి. ఈ పందిరులు గిఱ్ఱుమని చుట్టుఁదిరుగుటకు ననుకూలము లగునట్లుగా నిర్మింపఁబడినవి. ఈ మైదానమున కెదుట తొమ్మిది పందిరులతోఁగూడిన రాజభవన మొకటి నిర్మింపఁబడినది. తొమ్మిదవ యంతరువులోని పందిరిలో రాయలకు సింహాసన మమర్పఁబడినది.

అంతఃపురమునకును, బందిఖానకును మధ్య నాటకములును, పాటకులును, గాయకులును నుండిరి. రాజున కెదుటనున్న తెరకావలఁ బడుచులు సుందర వస్త్రాలంకార భూషితలై నృత్యములు సలుపుచుండిరి. మావటివాండ్రు మిక్కిలి యానంద ముప్పొంగునట్లుగా నేనుఁగులచే నాటలాడించుచుండిరి. మూఁడుదినము లీవిధముగా నాటలతోను, పాటలతోను, వినోదములతోను గడుపఁబడినవి. మూఁడవనాఁడు నాకు మరల రాజుదర్శనము లభించెను. మిక్కిలి వైశాల్యముగల సింహాసనము సువర్ణముతోఁ జేయఁబడి, యమూల్యములగు మణులచేఁ బొదుగఁబడియున్నది. సింహాసనమున కెదుటఁ జదరముగా నున్న మెత్తయొకటి కలదు. దాని కొనలయందు మూఁడువరుసల ముత్తెములతోఁ గుట్టఁబడియుండెను. రాజా మూఁడు దినములా మెత్తపైఁ గూరుచుండి యుండెను. ఆ మందిరముయొక్క గోడలును, పై కప్పును మణులచేఁ బొదుగఁబడిన బంగారు పలకలచేఁ గూర్పఁబడి యున్నవి. అవియును బంగారు మేకులతో బిగింపఁబడి యున్నవి.♦ ”

క్రీ. శ. 1520 వ సంవత్సరమున ‘ఫిగరిడో’ యను పోర్చుగీసు రాయబారి విజయనగరమునకు వచ్చెను. ఆతనివెంట ‘పెయిస్’ అను నాతఁడును వచ్చెను. అతఁడు విజయనగరమునఁ దాను జూచిన యంశములను వ్రాసెను. అందుండి క్రిందియంశములు వ్రాయఁబడు చున్నవి.

“ఆ రాజ్యమునకు విజయనగరము రాజధాని. అందు రాజెప్పుడు నివసించు చుండును. నగరమున కాఱుమైళ్ళ కీవలనే యడ్డముగా గొండల వరుసగలదు. దానిలో నుండి మార్గములు కలవు. వానికే ద్వారము లనిపేరు. ఆ ద్వారముల గుండఁ బోవలయునేకానిఁ నగరము లోనికిఁ బోవుటకు వేఱుమార్గములు లేవు. ఈ కొండల వరుస డెబ్బదిరెండు మైళ్ళు పొడవు గలిగి, యీ మహానగరముఁ జుట్టి యున్నది. ఈ పర్వత పంక్తికి లోపల నంటి చుట్టుకొనియున్న

♦ మహమ్మదీయ మహాయుగము, పుట, 393 - 397

యితరపంక్తు లనేకములు గలవు. ఈ పంక్తులలో నెచ్చటనైన సమ భూమి యున్నయెడల నచట బలాఢ్యమగు గోడ కట్టఁబడి యున్నది. ఈ రీతిగాఁ గొండలన్నియు మూసివేయఁబడి యున్నవి. జనులు నడచుటకు బాట లేర్పఱుపఁబడి, యాబాట లీ ద్వారములగుండఁ బోవును. ఈ ద్వారములకడఁ జిన్న గుహలు గలవు. అందుఁ గూర్చుండి రక్షక భటులు ద్వారములను రక్షించు చుందురు. ఈ యావరణము లోపల వరి మొదలగు ధాన్యములు పండునట్టి బయ ళ్ళును, నిమ్మలు, నారింజలు, పనసలు, మామిళ్లు మొదలగు ఫల వృక్షములతోనున్న తోఁటలును గల సారవంతములయిన భూములు గలవు. ఈ కొండల వరుసలకు మధ్యమున జలాశయములు పెక్కులు గలవు. వాని యాధారముల వలననే పై నుదహరించిన భూములు సాగుచేయఁ బడుచున్నవి. గోవా నగరమునుండి వచ్చిన బాట యొకటి మొదటి కొండవరుసలోఁగల ద్వారములలో నొక ద్వారము గుండ నగరములోఁ బ్రవేశించు చున్నది. పడమటి ప్రక్క నిదియే ప్రధానమైన ద్వార మగుటచేత గోడల చేతను, బురుజుల చేతను సురక్షితమై యొప్పెడు పట్టణ మొకటి (నాగలాపురము) రాజులచే మొదటి పంక్తి లోపలఁ గట్టఁబడినది. ఈ ద్వారమున కుండు తలుపు లును, బురుజులును మిక్కిలి బలాఢ్యము లయినవి, ఇతర నగరముల లోని గోడలవంటివి గాక, యీ గోడలు పాలగచ్చు చేయఁబడి, వే తెచ్చటను గానరా నట్టివిగా నున్నవి. లోపల మిద్దెటిండ్లవలె బల్ల పఱుపుగానున్న కప్పులుగల సొగసయిన కట్టడములచే నిరుపార్శ్వముల యం దలంకరింపఁబడి వీధుల పంక్తులు రమ్యముగా నున్నవి.

"నాగలాపురమునుండి విజయనగరమునకు నొకవీధి పోవు చున్నది. ఆ వీధికి నిరుప్రక్కలను నిండ్ల వరుసలు చక్కఁగాఁ దీర్చి యున్నవి. బాటసారులకు నీడ నిచ్చుటకై రెండు ప్రక్కలను వృక్ష ములు నాటింపఁ బడియున్నవి. ఈ వీధిలో సమస్త వస్తువులను విక్ర యించు నంగడులు గలవు. ఈ వీధిలో రాజు సుందరమైన యనంత శయన దేవాలయమును గట్టించెను. ప్రభువులును, సేనానులును

గట్టించిన దేవళములు గూడఁ గలవు. ఈ నగరము చుట్టును బలువు గల పెద్దరాళ్ళతోఁ గట్టఁ బడిన గోడ గలదు. అది మిక్కిలి బలాఢ్యమైనది గాని, ప్రస్తుతము కొన్నిచోట్ల శిథిలమై యున్నది. అందు సురక్షితములైన దుర్గములు గలవు. ఈ గోడకుఁ బ్రక్కను నచ్చటచ్చటఁ బల్లపు ప్రదేశములందు నీటిచే నింపఁబడిన కందకములు గలవు. దానికి వేఱుగా నట్టిదే మరియొక గోడ కలదు. మనుష్యుని ఱొమ్ముఁ దాఁకునంత యెత్తుగలిగి, మొనలు తేలియున్న రాళ్లు పాతఁబడి యున్నవి. ఈ గోడ, కొండలకు మధ్యనున్న పల్లపు ప్రదేశములం దెత్తుగాఁ బెట్టఁబడి, కొండల వఱకు వ్యాపించి యున్నది. ఈ గోడ మొదలుకొని నగరము ప్రవేశించుటకు మధ్యమున నెక్కువ దూరము గలదు. కనుక, నాప్రదేశములందు వరి పొలములును, తోఁటలును, దొడ్లును, నీటి కాలువలును గలవు. ఈ గోడయొక్క మొదటి పంక్తిగుండ నీరు ప్రవహించు చున్నది. నీళ్ళు పాఱు చుండుట వలనఁ జెఱువులు జలపూర్ణములై యున్నవి. ఇచట ఫలవృక్షములతోఁ గూడిన తోఁటలును, నొక చిన్న తాళ్ళ గుంపును, ననేక గృహములును గలవు. నగరముయొక్క మొదటి ద్వారము కడకు వచ్చుటకుముందు మరొక నీటికాల్వను దాఁటి, మలుపు తిరిగిన బలాఢ్యమగు నొక రాతిగోడ యొద్దకు వచ్చెదరు. ఈ ద్వారమున కిరుప్రక్కలనుండు రెండు బురుజులును దానిని గాపాడు చున్నవి. ఆ ద్వారము మిక్కిలి సొగసయి నట్టిదియుఁ బెద్దదగు నట్టిదియునై యున్నది. ద్వారమును దాఁటి లోపలకుఁ బోవఁగానే రెండు చిన్న దేవళములు గానిపించును. ఒక దేవాలయపుఁ బ్రాకారము లోపల వృక్షములును, మరియొక దేవాలయపుఁ బ్రాకారములోపల నిండ్లును గలవు. ఈ మొదటి ద్వారమునఁ గల కుడ్యము నగరము నంతను జుట్టి వచ్చుచున్నది. మఱి కొంతదూరము పోయిన తోడనే, మఱియొక ద్వారమును, గోడయుఁ, గాన్పించును. ఈ గోడయు నగరము నంతను జుట్టివచ్చు చున్నది. ఇచటనుండి రాజ భవనాంతఃపురము వఱకుఁ గల మధ్య భూమియందు వీధులును, నిండ్ల వరుసలును, సేనానులయొక్కయుఁ, బ్రభువులయొక్కయు నందములగు మందిరము

లును గలవు. చూచుటకు వినోదకరములగు విగ్రహములతో నలంకరింపఁ బడిన యిండ్ల వరుసలు మనోజ్ఞములై యొప్పుచున్నవి. ముఖ్యమైన దగునట్టి పెద్ద వీథిగుండ వెళ్ళునపుడు రాయల యంతఃపుర భవనమున కెదుటనున్న గొప్ప మైదానమునకుఁ గొనిపోవు ద్వారము గల ప్రధానమైన మార్గమొకటి కలదు. దీని కెదురుగా మఱియొక మార్గము నగరముయొక్క రెండవ భాగమునకుఁ బోవుచున్నది. నగర మధ్యమునుండి మిక్కిలి యుపయోగము గలది యగుటచేత నా మైదానముగుండ సరకులు మొదలగు వాని నెక్కించుకొని బండ్లు నడుపఁ బడుచుండును. లిస్బను (*Lisbon*) నగర దుర్గము (పోర్చుగల్ దేశపు రాజధాని) ఎంత స్థల మాక్రమించు కొనెనో, యంతకంటె నెక్కువస్థల మాక్రమించుకొని రాయల మందిరము బలాఢ్యమై, సురక్షితమైయున్న ప్రాకారము గలిగి యున్నది.

'ఇంకను గొంతదనుక నడచి, యావలిద్వారము కడకుఁబోయిన, దానితో సంబంధించిన యిరుపార్శ్వముల రెండు దేవళములు గలవు. ఈ రెంటిలో నొకదాని ద్వారముకడఁ బ్రతిదినమును గొఱ్ఱెలను బెక్కింటిని జంపుచుందురు. ఈ దేవళములకు దాపునఁ జిత్తరువులు చెక్కబడినట్టియు, విగ్రహములతో నలంకరింపఁ బడినట్టియు జయ సూచకమయిన రథమొకటి కలదు. సంవత్సరమున కొకసారి దేవతోత్సవమునాఁడు నగరవీథులగుండ రథము నూరేగింతురు. అది మిక్కిలి పెద్దదగుటనలన మూలలఁ దిరుగనేరదు. ఇంకను ముందునడువ, విశాలతయు, సొగసునుగలదై, యిరుపార్శ్వములందు సుందరములగు గృహముల వరుసలను గలిగియున్నదై, నేనిదివఱకు పైనుదాహరించి వర్ణించిన వీథులంబోలిన యొకవీథి గలదు. ఆ వీథిలోని గృహములు భాగ్యవంతులకు నివాసములయి యొప్పుచున్నవి. ఈ వీథిలో వణిజులు పెక్కండ్రు నివసించుచున్నారు. ఇందుఁ బెక్కురకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు మొదలగు రత్నములును, వస్త్రములును నింకను బ్రపంచములో దొరకునట్టి పవిత్రవస్తువులును విక్రయించబడుచుండును. ప్రతిసాయంకాలము

నొక సంత జరుగును. అచట సామాన్యములయిన గుఱ్ఱములు, గుఱ్ఱపు తట్టులు మొదలగు జంతువులు మాత్రమేకాక, దబ్బపండ్లు, నిమ్మ పండ్లు, నారింజపండ్లు, ద్రాక్షపండ్లు మొదలగు ఫలవర్గమును విక్ర యింపఁబడుచుండును.

'ఆ వీథికొనయందు మరల నొకద్వారమును, గోడయును గాని పించును. ఆ ద్వారములోనుండి పోయినయెడల నావల నొకవీథి గానిపించును. అచట కర్మకరులు (పంచాణులు) పెక్కండ్రు నివ సించుచున్నారు. వార లనేక వస్తువులను విక్రయించెదరు. ఇచట రెండు చిన్న దేవళములు గలవు. ప్రతి వీథియందును దేవాలయములు గలవుగాని, ప్రధానములయినవియు, గొప్పవియు నగు దేవాలయ ములు నగరమునకు వెలుపలిప్రక్కనే కలవు.'

'వజ్రములు మొదలగు నమూల్యమణులయొక్కయు, నితర వస్తువులయొక్కయు వర్తకము విరివిగా జరుగుచుండుటచేత నా మహానగరమున నన్నిజాతుల మనుష్యులును గలరు. ఈ నగర విస్తీ ర్ణతనుగురించి నేను వ్రాయను. ఏలన, నయ్యది యొకప్రదేశము నుండి చూచుటకుఁ గానరాదు. నేనొక కొండనెక్కి, యెక్కువభాగ మును జూడఁ గలిగితినిగాని, పెక్కు కొండల పంక్తులకు మధ్యమున నగరమంతయు నిమిడియుండుటచేత, గొంతభాగము గానుపింపలేదు. అచటనుండి చూడఁగా, నాకుఁ గనుపట్టినభాగము రోమకపురి (*Rome, the capital of Italy in Europe*) యంత పెద్దదిగానుండి, చూపునకు మిక్కిలి సుందరముగాఁ గానుపించినది. దానిలోపలఁ జెట్లగుంపు లనేకములు గలవు. ఇండ్లకుఁ జేరినతోఁటలలో నీళ్ళకాలు వలును, నచటచటఁ జెఱువులును గలవు. రాజు తన యంతఃపుర మందిరమునకు సమీపమునఁ దాళ్ళవనమును, నానావిధ ఫలవృక్ష ములతోఁ గూడిన తోఁపులను గలిగియుండెను. తురుష్కుల నివాస భూమికి దిగువనొక చిన్ననదియును, మామిడితోఁటలు, పోఁకతోఁటలు, పనసతోఁటలు, జామితోఁటలు, నిమ్మతోఁటలు, నారింజతోఁటలు మొదలగునవి దట్టముగానుండి పెరుఁగుచు మహారణ్యమువలెఁ గాని

పించుచున్నవి. తెల్లద్రాక్షతోటలు విశేషముగాఁ గలవు. నగరము లోనికి వచ్చునీరంతయు మొదటి ప్రాకారమునకు వెలుపలనున్న - నే నుదాహరించిన - చెఱువులనుండి తేఁబడుచున్నది. ఈ నగరము లోని జనసంఖ్య లెక్కించుట కలవిగానిదిగా నుండుటచేతను, నే నుదాహరించిన గల్పితముగాను, నతిశయోక్తిగాను నుండునను భీతిచేతను నుదాహరింప మానినాఁడను.'

'ఇయ్యది ప్రపంచములో సమస్త వస్తుసముదాయముచేతను, నిండియున్న మంచినగరముగానున్నది. గోధుమలు, వడ్లు, అనుములు, పెసలు, కందులు, ఉలవలు మొదలగు ధాన్యములును సమృద్ధిగాఁ జేర్పఁబడి, మిక్కిలి చౌకగా విక్రయింపఁబడుచున్నవి. ఇతర ధాన్య ములవలె గోధుమలు మూఁకలచేఁ దక్కఁ దదితరులచే నంతగా భుజింపఁబడుచుండలేదు. అందువలనఁ దక్కువగానుండును. తప్పించు కొని పోవుటకు వీలులేనంత దట్టముగా బరువులు వేయఁబడిన యెడ్లు వీధులలోను, బజారులలోను లెక్కింపశక్యముగాక, క్రిక్కిఱిసి యుండును.

'ఉత్తరమున నగరప్రాకారములకు వెలుపల సుందరతమంబు లగు మూఁడు గొప్పదేవళములు గలవు. అందొకటి - విఠలస్వామి యాలయము, ఆనెగొంది పురమున కెదురుగాఁ గట్టఁబడియున్నది. రెండవది - హంపి దేవాలయమని ప్రసిద్ధిఁగాంచిన విరూపాక్షా లయము. యాత్రికులచే నిది మిక్కిలి మహిమగలదిగాఁ జూడఁబడు చున్నది. ఈ దేవాలయములోఁ దూర్పుగానున్న ముఖద్వారమున కెదురుగా మిక్కిలి సుందరమై, యింపుగాఁ గట్టబడిన యిండ్లును, వసారాలును గలిగి, రమ్యమైనట్టి వీధి యొకటి కలదు.

'ప్రధాన పర్వదినము రాఁ దటస్థించిన కాలమున రాయ లీ క్రొత్త నగరమునుండి (నాగలాపురము) విజయనగరమునకు వచ్చి, యియ్యది రాజ్యమునకంతకు రాజధాని కావున, నచట సమావేశమై యెల్లరచోఁ గలిసి, యాచారవిధుల ననుసరించి, విందులు మొదలగు వినోదముల జరిగించును. ఈ యుత్సవములకు రాజ్యములో నుండెడు

నాటక స్త్రీయలెల్ల రను రప్పించెదరు. మఱియు, రాజులను, మహాప్రభువులను, సేనానులను వారల రాణువలతోడను, పరివారముతోడను రప్పించెదరు. యుద్ధము చేయుటకై పంపఁబడినట్టియు, రాజ్యములో దూరముగా నున్నట్టియు, ఉత్కలరాజ్యముయొక్కయు, బీజపుర రాజ్యముయొక్కయు సరిహద్దుల కడనున్నట్టి సేనానులు మాత్రము రప్పింపఁబడరు. ఆ యుత్సవములలో జేరిన నవరాత్రోత్సవములు నేనా నగరమున నుండినపుడు రాజభవనమున మిక్కిలి వైభవముతో జరుపఁబడినవి. రాజభవన మీ తీరున నున్నది. రాజభవనమునకు నేనిదివరకుఁ బైనుదాహరించిన బయలునకుఁ బోవుటకై ద్వారమొకటి తెరువఁబడియున్నది. ఈ ద్వారముపై నితర గోపురములకువలెనే వసారాలుఁగలిగి కొంచె మెత్తుగలగోపురము కలదు.♦”

హంపి :

హంపి – గుంతకల్లునుండి హుబ్లికిఁబోవు ఇనుపదారియందు హోసపేట స్టేషనునకు రమారమి యెనిమిదిమైళ్ళ దూరమునఁ గలదు.

నేఁడు– హంపియని పిలువఁబడు కుగ్రామమే నాఁడు – విజయనగర మహాసామ్రాజ్యమునకుఁ బ్రధాన నగరమై యొప్పెను.

హంపికి – విరూపాక్షము, విజయనగరము, విద్యానగరము కిష్కింధ యను పేళ్ళు గలవు. విరూపాక్షుని యాలయ ముండుటచేత విరూపాక్షమనియు, బుక్కరాయలు దేశములను జయించి యీ పట్టణమును గట్టించుటవలన విజయనగరమనియు, విద్యారణ్యునిపేర నిది నిర్మింపఁబడుటవలన విద్యానగరమనియు, రామాయణమున కిష్కింధకు సమీపమునఁ జెప్పఁబడిన ప్రదేశము లిట నుండుటవలన కిష్కింధయనియుఁ బేళ్ళు గలిగెను.

ఆ క్షేత్రమునందలి విరూపాక్షునకు పంపాపతి యనియు, పార్వతికి పంపాదేవి యనియు నామములు గలవు. ఆ కారణమున నచ్చటఁ బ్రవహించెడి తుంగభద్రానదికి ‘పంప’ యనుపేరు గలిగెను. పంపా

---

(1) మహమ్మదీయ మహాయుగము, పు, 429 – 435

(2) Forgotten Empire - Pages - 287-290.

శబ్దము కర్ణాటకభాషలో హంపిగ మాఱి, అచ్చట కట్టఁబడిన విజయ నగరపట్టణము సహితము హంపియని పిలువఁబడుచున్నది.

ఇచ్చట ప్రతివత్సరము చైత్రశుద్ధ పూర్ణిమా చిత్తా నక్షత్ర పర్వదివసమున నత్యంత వైభవముతో రథోత్సవము జరుగును.

హంపి—హాసపేటకు దక్షిణమున మూఁడుమైళ్ళదూరమునఁ గల 'రాచురకెరె' కోటగోడ మొదలు ఉత్తరమున ఆనెగొంది చివర వఱకుఁ బంద్రెండుమైళ్ళు నిడివికలదియు, కంప్లి - దరోజి దిశగల పడ మటి కోటగోడ మొదలు రక్షకదుర్గములవరకుఁ బదిమైళ్ళు వెడల్పు గలదియునై యుండెను. ఈ పట్టణమునకు తూర్పున కాంపిల్యనగర మును, ఉత్తరమున ఆనెగొందియు, పశ్చిమమున నాగలాపురమును, దక్షిణమున దరోజియు బాహ్య ద్వారములు. ఈ నగరమునకు చుట్టును ఏడు కోటలుగలవు. హాసపేటకు నైరృతిభాగమున మొదటి కోటయు, దానికి సమీపమున రెండవకోటయు, మల్పనగుడిచాటున మూఁడవకోటయుఁ దానికి ఉత్తరమున నాల్గవకోటయు, కమలాపు రమునందలి చెఱువునకు దక్షిణమున ఐదవకోటయు, ఆ గ్రామమునకు ఉత్తరమున ఆరవకోటయు, దానికిసమీపమున ఏడవకోటయు గలవు. ఏడవకోటమాత్ర మిప్పటికిని చాలమట్టునకు కట్టినరీతినే యున్నది. దీని లోపలిభాగముననే రాచనగరులు—వానికి సంబంధించిన కట్టడ ములు కట్టఁబడియున్నవి.

హాసపేటకు రెండుమైళ్ళ దూరమునఁగల 'నాగెనహాళ్ళి'యే యప్పటి నాగలాపురము. శ్రీకృష్ణదేవరాయ లీపురమును తన తల్లి యైన నాగలాదేవిపేరఁ గట్టించి, తన ప్రధాన వాసస్థానముగఁ జేసి కొనెను. తరువాత కొంతకాలమునకు రాయలు తన భార్యయైన తిరు మలదేవిపేర నొక పట్టణమును గట్టించి, దానికి 'తిరుమలదేవియార పట్టణ' మని పేరిడెను. అదియే నేఁటి హాసపేట.

శిథిలభాగము లన్నియు హంపిగ్రామమునకు చుట్టుఁబట్టుల తొమ్మిది చదరపుమైళ్ళ వైశాల్యమునఁ గలవు. యాత్రికుఁ డా భాగములను చూచుటకు ఆరుత్రోవలఁ బయనించవలెను.

౧

# కమలాపుర మార్గము

( హొసపేట - కమలాపురము )

యాత్రికుఁడీ త్రోవను పయనించుటకు ముందు జంబునాథుని దర్శింపవలయును.

జంబునాథదేవాలయము :

హొసపేటకు ఆగ్నేయభాగమున, మూఁడుమైళ్ళ దూరమున జంబునాథపర్వతము గలదు. దానియెత్తు సముద్రమట్టమునకు 2,980 అడుగులు. ఆ పర్వతమధ్యభాగమున, విశాలమగు సమప్రదేశమున, జంబునాథస్వామి ఆలయము నిర్మింపఁబడియున్నది. కొండ యడుగు భాగమునుండి దేవాలయము వఱకును నడచుటకు ననువగు మెట్లు గలవు. ఈ దారి నడుమ నొక మండపమున్నది. దాని స్తంభములలో రెండింటిపై శాసనములు చెక్కఁబడియున్నవి. అం దొక్కటి ఆపర్వతమునందలి అనంతశయన - ఆంజనేయ దేవాలయములకు మాన్యము లుంచియున్నట్లు తెలుపుచున్నది. అయ్యది క్రీ. శ. 1549 వ సంవత్సరమునకు సంబంధించిన శాసనము. దేవాలయమునఁ జూడఁదగిన శిల్ప విశేషములు లేవు. కాని, ఆలయ సమీపమున ధాతుశక్తిగల యూట నీటిబావి మాత్రము గలదు. అందలి నీరు బలుఁతెఱఁగులగు వ్యాధులను కుదుర్చునందురు. ఇచ్చటి విశేషమొక్కటి. ఈ కొండయందలి పచ్చరాల కాంతులు - అందు సంచరించెడి మనుజులపైఁ బ్రసరించినప్పుడు, వారిదేహములు పచ్చని కాంతుల నీనుచుండును.

అనంతశయనాలయము :

యాత్రికుఁడు జంబునాథుని దర్శించిన పిదప, హొసపేటకు మరలివచ్చి, యటనుండి కమలాపురమార్గము ననుసరించవలెను.

హొసపేటకు ఈశాన్యదిశయందు, ఒక మైలు మూడు ఫర్లాంగులు పయనించినపిదప, 'అనంతశయనగుడి' యనుగ్రామ మగపడును.

దానికి దక్షిణపుదిక్కున, దారికించుక దూరమున, ఒక దేవాలయము కలదు. అదియే – అనంతశయనాలయము. దాని గోడపై క్రీ. శ. 1524–వ వత్సరమునఁ జెక్కఁబడిన శిలాశాసనమును చూడ శ్రీ కృష్ణ దేవరాయ లా ప్రదేశమున తన జ్యేష్ఠకుమారుఁడగు తిరుమలయ్యా దేవమహారాయల♦ పేర 'సలెతిరుమలమహారాయపుర' మను గ్రామమును గట్టించి అం దా దేవాలయమును నిర్మించి, దాని కనేక దానములు గావించినట్లు తెలియుచున్నది. సలెతిరుమలమహారాయపురమే 'అనంతశయనగుడి' యనఁబరగి, కాలక్రమమున 'అంచనగుడి' యని పిలువఁబడుచున్నది,

అనంతశయ నాలయ సింహద్వారము ఉత్తరాభిముఖము. గర్భాలయము సామాన్యమైనది కాదు. అది నాలుగు మూలలు తీర్చిన పెద్దమంటపము. ప్రకృత మది శిథిలమైయున్నది. గర్భాలయమునకుఁ దగినట్లుగ పొడవైన వేదికయు, అండాకారము గల పైకప్పును గలవు. శయనమూర్తియైన మూలవిగ్రహముయొక్క పరిపూర్ణదర్శనము యాత్రికులకు అబ్బునట్లు గర్భాలయమునకు మూఁడు వాకిండ్లు నిర్మింపఁబడియున్నవి. దేవాలయమున విగ్రహము లేదు. ఈ యాలయమునకొఱకు చెక్కఁబడిన విగ్రహ మిప్పుడు హడగలి తాలూకాలోని 'హొళల్ళి' గ్రామమున నున్నది.

ప్రజ లీ విగ్రహమునుగూర్చి యిట్లు చెప్పెదరు. విగ్రహనిర్మాణము పూర్తియైనదఁట. దాని నీ యాలయమున జేర్చుట కొక పురుషుఁడు నియోగింపబడెనఁట. ఆతఁడు దేవాలయమునువిగ్రహముతోఁ జేరుటకు ముందు ప్రయాణమున నెందును నిలిచి వెనుదిరిగి చూడరాదని అనంతశయనుని యాజ్ఞయఁట. అతఁడు విగ్రహమును గొంపోవుచు హొళల్ళి సమీపించి వెనుదిరిగి చూచెనఁట. అంతనా విగ్రహ మచ్చటనే నిలిచిపోయెనఁట.*

♦ వీరప్రతాప తిరుమలదేవరాయలమహారాయ లని శాసనములందుఁ గలదు.
Vide - Ep. Carn. Vol. IX, Magadi, Nos. 6 and 83; Ep. coll. No. 1.. of 1895.

* Hampi Ruins - Page, 134.

పై విషయమునకు విరుద్ధముగా క్రీ. శ. 1549-వ వత్సరమున విజయనగరాధీశుండైన సదాశివరాయలు అనంతశయనుని దర్శించి, దేవునికి భూదాన మొసంగినట్లు, ఆలయమునందలి మఱియొక శాసన మువలనం దెలియుచున్నది.$ ఈ శాసనాధారమును బట్టి ఆలయ మున విగ్రహప్రతిష్ఠ మైయుండనోపుననియు, కారణాంతరమున ఆ విగ్రహము హళాలళ్ళికిం గొంపోబడియుండుననియు నూహింపవలసి యున్నది.

ఈ యాలయముకడ క్రీ. శ. 1793-వ వత్సరమున ఆనెగొంది రాజగు తిరుమలదేవరాజునకును, టిప్పుసుల్తాను సేనానియగు కమల్ ఉద్దీన్ అను నతనికిని యుద్ధము జరిగినట్లు తెలియుచున్నది.‡

సూళెయబావి :

ఇది—అనంతశయనాలయమునకు ఒకమైలు మూఁడు ఫర్లాంగుల దూరమున, త్రోవ కెడమవైపునం గలదు. దీని నిర్మాణక్రమము చిత్రము. లోపలిభాగము చుట్టును అష్టకోణాకారపు వసారా ఎనిమిది కమానులతో నిర్మింపఁబడి యున్నది. వసారాలోనికిం బోవుటకు నను వైన సోపానమార్గము కలదు. దీని నొకవేశ్య కట్టించెనఁట. కావున నిది 'వేశ్యాకూప' మనియు సూళెయబావి యనియుఁ బిలువఁబడుచు న్నది. కర్ణాటక భాషయందు 'సూళె' యనఁగా 'వేశ్య' యని యర్థము.

మహమ్మదీయ సమాధులు :

ఈ బావికి ఒకమైలు ఏడుఫర్లాంగుల దూరమున బాట రెండు పాయలుగాఁ జీలును. అందొకటి—తూర్పుభాగముగ కమలాపురము నకుఁ బోవును; మఱియొకటి—యీశాన్యదిశగా పంపాపురమునకుఁ బోవును. పంపాపురమునకుఁ బోయెడి బాటయం దొక మైలు దూర మున 'కదిరాంపుర' మను పల్లెగలదు. దాని సమీపమున, త్రోవకు నెడమవైపున మూఁడు సమాధులు గలవు. వాని చుట్టును ప్రాకా

$ A Guide to Hampi and Vijayanagar, Page 17.

‡ Chronicle of Tirumala Deva Raju.

రముగలదు. ప్రాకారమునకు నలువైపుల మఱికొన్ని సమాధులుగలవు. కాని, అవి యెవరికాలమున ఎవరికొఱకు నిర్మింపఁబడినవియో తెలుపుటకుఁ దగిన యాధారములు లేవు. వీని కించుక దూరమున నున్న అనంతశయనాలయముకడ ఆనెగొంది రాజునకును, టిప్పుసుల్తాను సేనానికిని 1793 వ సంవత్సరమున జరిగిన యుద్ధమున మరణించిన మహమ్మదీయ యోధులకొఱకు నిర్మించినవై యుండవచ్చునని తోఁచుచున్నది.

సమాధులను చూచినపిదప, యాత్రికుఁడు, కమలాపురమునకుఁ బోవు శాఖాపథము ననుసరించవలెను. కమలాపురము సమీపించు సరికి విశాల తటాకమొకటి దృష్టికి గోచరించును. తుంగభద్రానదీ మధుర తోయము లీ తటాకములోనికి అనిశము రాయల కాలువ ద్వారమున ప్రవహించుచుండును. దీనిని దాటఁగనే కమలాపురము కానిపించును.

కమలాపురము హాసపేట రైల్వేస్టేషనునకు ఏడుమైళ్లు దూరమున నున్నది. ఇందు, చూడఁదగిన విశేషములులేవు. ఇందలి బాట కెడమవైపున బాటసారులు దిగుట కనుకూలమగు సత్రమున్నది. ఇది యొక పాడుపడిన దేవాలయము. జె. హెచ్. మాస్టర్ (*Mr. J. H. Master*) బళ్లారి మండలమునకు కలెక్టరుగా నుండిన కాలమున ఈ శిథిలాలయమును బాగుచేయించి, పథికాశ్రయముగా నొనర్చెను.

పట్టాభిరామాలయము :

కమలాపురమునకు తూర్పుభాగమున, బళ్లారి మార్గమున, అర మైలు దూరమున, ఈ దేవాలయము కలదు. ఇది 1530–1542 సంవత్సరముల మధ్యకాలమున తుళువవంశజుఁడగు అచ్యుతదేవరాయలచే నిర్మింపఁబడినట్లు ఆలయమునందలి శాసనమువలనఁ దెలియుచున్నది. శిథిలాలయము లన్నిటిలో నిది పెద్దదియని చెప్పవచ్చును. దీని ముఖ మంటపము మిక్కిలి విశాలమై, అందముగా నుండును. గర్భాలయమున విగ్రహము లేదు. దీనికి దక్షిణభాగమున మఱియొక మండప

మున్నది. అందలి కంబము లొక్కొక్కటియు పది పండ్రెండు కంబ ములుగాఁ జీల్చఁబడి, సొంపుగూర్చుచుండును. ప్రాకారము లోపలి భాగమున నిర్జలకూప మొండు కలదు. సింహద్వారము పూర్వాభి ముఖము. దీనిపై నున్నతమైన గోపురము కలదు. ఇది కొంతవరకు శిథిలమైయున్నది.

హనుమంతుని సింహద్వారము :

ఇది—పట్టాభిరామాలయమునకు ఈశాన్యభాగమున అరమైలు దూరమునఁ గలదు. దీని చుట్టుఁబట్టుల శిథిలములయిన కోటగోడలు గలవు. దీని యడుగుభాగము హైందవ శిల్పకళలకును, గుమ్మటపు టాకృతిగల గోపురము మహమ్మదీయశిల్పకళకును ఉదాహరణములుగా నున్నవి. ఇందలి లోపలి భాగమునఁగల గదిలో హనుమంతుని విగ్రహ మున్నది. కావున దీనికి 'హనుమంతుని సింహద్వార' మను పేరు గలిగెను.

భీమద్వారము :

హనుమంతుని సింహద్వారమునకును, గానిగిత్తి* దేవాలయ మునకును మధ్యభాగమున, నన్నూరు గజముల దూరమున భీమ ద్వారము గలదు. ఇందు భీముని విగ్రహము చెక్కఁబడి యుండు టచే దీనికి భీమద్వారమని పేరుగలిగెను. ఇందొక రాతిపై శాసనము గలదు. ఇది బలిష్ఠమైన కట్టడము.

ఈ మార్గమునఁ జూడఁదగిన శిథిలము లివి.

---

* ఈ యాలయము కాంపిల్యనగరమార్గమునఁ గలదు.

# కాంపిల్యా నగరమార్గము

( కమలాపురము – మధువనము )

కాంపిల్యానగరమే కంపిలి.

మసీదు :

కమలాపురమునకు కొలఁది దూరమున, త్రోవ కెడమవైపున మసీదుకలదు. ఆనాఁడు—ఆదోనిని పాలించిన 'ముస్‌లిమ్ యార్ జంగ్' అను నతఁడు దీని రక్షణకర్త యని తెలియుచున్నది. మహనీయుఁడైన 'సయ్యద్ నూరుల్లాఖాదరి' జ్ఞాపకార్థమిది కట్టఁబడెనం దురు. ఈ మహాత్ముని చరిత్ర తెలియదు. ఈతని స్మరణార్థము మహమ్మదీయు లిచట ప్రతి వత్సరము రంజాన్ నెలలో పదునైదవ దినమున నొక యుత్సవము జరుపుదురు.

'గానిగిత్తి' దేవాలయము :

మసీదునుదాఁటి కొంతదూరము నడచినతరువాత, త్రోవకు కుడివైపున ఈ దేవాలయ మగపడును. 'గానిగిత్తి' యన 'గాండ్లవారి పడు'చని యర్థము. ఈ యాలయమునకు ఈ పేరెట్లు కలిగెనో తెలియ కున్నది. దీని నిర్మాణక్రమము సంపూర్ణముగ జైనపద్ధతి ననుసరించి యున్నది. హైందవ శిల్పకళ యిందు కలికమునకైనఁ గానరాదు. ఇట్టి యాలయములు మఱికొన్ని యిచ్చటి శిథిలభాగములందు కను పించుచున్నవి. దీని ముందుభాగమునందలి ఉత్తుంగ స్తంభమునందలి శాసనముచూడ నిది క్రీ. శ. 1385 వ వత్సరమున, రెండవ హరిహర రాయలకాలమున ఆతని దండనాథుఁడైన 'ఇరుగప' కట్టించినట్లు స్పష్టముగఁ దెలియుచున్నది.♦ ఈతనితండ్రి పైచ దండనాయకుఁడు; జైనమతస్థుఁడు. 'నానార్థరత్నమాల' యను నిఘంటువును రచించిన పండితుఁడు. ఆలయ ముఖద్వారమున ఒక జైనసన్యాసి కూర్చుండి నట్లును, ఆతని శిరముపై మూఁడు గొడుగు లొకదానిపై నొకటి పట్టఁ

♦ South Indian Inscriptions, Vol. I Page, 156.

బడినట్లును ఒక విగ్రహము చెక్కబడియున్నది. ఇది జైనాలయ మనుటకు శిల్పమేకాక, ఇదియు ప్రబల సాక్ష్యము.

రఘునాథాలయము :

గానిగిత్తి దేవాలయమునుండి కొంతదూరము పయనించిన పిదప, కాంపిల్యనగరమార్గము రెండు పాయలుగాఁ జీలును. అందు ఎడమచేతివైపు బాట కొంతదూరముపోయి, తలారిగట్టు మార్గమున లీనమయి, తుంగభద్రానదీతీరము చేరును. కుడిచేతివైపు బాట మాల్యవంత పర్వతశ్రేణులనుదాఁటి కాంపిల్యనగరమునకు పోవును. యాత్రికుఁడీ బాటననుసరించి కొంతదూరముపోయిన శ్రోవనాను కొని, యెడమచేతివైపున పర్వతము పైభాగమున నొక యాలయము కనఁబడును. అదియే – రఘునాథాలయము. ఆలయముగల కొండ. మాల్యవంత పర్వతశ్రేణులలో 'ప్రస్రవణగిరి' యని పిలువఁబడు చున్నది.

ఆలయము పూర్వాభిముఖము. గర్భాలయమునకు పైభాగ మున ఉన్నతమైన గోపురముకలదు. ముఖశాలయందలి కల్యాణ మంటపమునఁగల శిల్పకళ ముద్దులొలుకుచుండును. ప్రాకారమున అందందు సర్పములు మున్నగునవి మిక్కిలి యందముగఁ జెక్కఁ బడియున్నవి. శ్రీరామచంద్రుఁ డిచ్చట నున్నకాలమున పితృతర్ప ణము కొఱకు గండశిలపై బాణమువేయ, నది యాబండను పగిల్చి నీటినిపైకిఁ దెచ్చెనని చెప్పుచు అచ్చటివారలు చూపించెడు 'రామ బాణ' మని పిలువఁబడు దొన యావరణమున ఆలయమునకు దక్షిణ భాగమునఁగలదు. ఇందలి నీరు చల్లగనుండి, పథికుల మార్గాయాసముఁ బాపును. దీనికి దక్షిణభాగమున లక్ష్మణుఁడును బాణమువైచి, నీటిని తెప్పించిన దొన మఱియొకటి కలదు. దానిని'లక్ష్మణబాణ' మందురు. లక్ష్మణబాణముకడ రామలక్ష్మణులు దశరథునకు పిండప్రదాన మొనర్చి, బ్రాహ్మణులకు స్వర్ణశృంగములుగల గోవులను దానము చేసినట్లు తెలుపు పిండాకారములును, ధేనురూపములును చిత్రితములై యున్నవి. లక్ష్మణబాణమునకు సమీపమున ఆగ్నేయభాగమున, ఉన్నతస్థలి నొకగుండుపై శివాలయమొకటి నిర్మింపఁబడియున్నది.

రఘునాథాలయ గర్భగృహమున శ్రీ సీతారామలక్ష్మణాంజ నేయ దివ్యవిగ్రహము లొకశిలపై చెక్కఁబడియున్నవి. విగ్రహములకు ఈవల నావల సప్తర్షుల శిలావిగ్రహములు గలవు. ప్రతివత్సర మిచ్చట చైత్రశుద్ధ నవమీ దివసమున రథోత్సవము జరుగును.

ఆనందగుహ :

మాల్యవంత పర్వతమును విడిచి అరమైలు దూరము పోయిన పిదప ఎడమచేతి వైపున నుండొడి వేపచెట్టుకడ, ప్రధాన మార్గము నుండి యొకబాట చీలును. ఆ త్రోవ ననుసరించి అరమైలు నడచి నచో, తుంగభద్ర కాలువ కనఁబడును. దాని గట్టున, ఉన్నత శిలా తలమున, ఆనందగుహకు సంబంధించిన కట్టడములు కలవు. ఈగుహ మాల్యవంతపర్వతశ్రేణులకు వెనుకభాగముననున్నది. ఆనందగుహయే ఆనందాశ్రమము.

ఈ యాశ్రమమున శంభునాథుని భవనమును, శిష్యుల కుటీర ములును, యజ్ఞవేదికయు, ఆంజనేయుని గుడి మొదలగు కట్టడములు గలవు. శంభునాథుని మేడపైభాగమున ఒక విశాలమైన గదిగలదు. అం దాతఁడు కూర్చుండుటకు పలుతెఱఁగులగు ఆసనములును, వివిధ భాషలయందు రచింపఁబడిన వేదాంత గ్రంథములును చూచుట కింపుగ నమర్పఁ బడి యుండును. క్రిందిభాగమున మహానసశాలయు, ఉగ్రాణమును గలవు. ఒక వైపున గ్రంథాలంకృతమైన గదియు, దాని కించుక పశ్చిమభాగమున శివాలయమును, దాని కించుక పైభాగ మున యజ్ఞవేదికయు, దానికి ఉత్తరభాగమున ఉన్నతప్రదేశమున ఆంజనేయాలయమును, దానికి పైభాగమున ఆనందగుహయు వెలయు చున్నవి. గుహాముఖము చేరుటకు క్రిందిభాగమునుండి యమర్పఁబడిన యినుపనిచ్చెన గలదు. అం దాతఁడు కూర్చుండి తప మొనరించుటకు అనుకూలమైన శీర్షయుక్తమగు కస్తూరిమృగాజినము కలదు. శంభు నాథుని మేడ వీడి, కాల్వగట్టున కొన్ని గజములు నడచినచో పశు శాలయు, దాని కించుక దూరమున సుందరారామమును దృష్టి పథమునఁబడును.

శంభునాథుఁడు కాశ్మీరదేశస్థుఁడు, బ్రాహ్మణుఁడు. ఈతనికి పూర్వాశ్రమమునఁ గల పేరేదియో తెలియదు. దబ్బపండువంటి శరీరచ్ఛాయ గలవాఁడు. హసన్ముఖుఁడు. మధురవచోప్రియుఁడు. మితభాషి. బహుభాషావేది. వేదాంతశాస్త్ర పారగుఁడు. అఱువదికి మించిన వయస్సు గలవాఁడు. కాషాయ వస్త్రధారణ మొనర్చి, భ్రూమధ్యమున కుంకుమ రేఖ దిద్ది, తావళము చేఁబూని ఆశ్రమస్థలిని నడచునప్పుడు, ఆ దివ్యపురుషునిఁజూడ రెండు కన్నులు చాలవు.

ఈతఁడు పూర్వాశ్రమమున డిప్యూటీకలెక్టరు పదవియందుండి, ఒకపరి హంపి విజయనగరమును దర్శింపవచ్చి, దాని నైసర్గిక స్వరూపమునకును, అందలి ప్రశాంతికిని మిక్కిలి యబ్బురపడి, అందొక యాశ్రమమును నిర్మించుకొని తన జీవిత శేషమును గడప నిశ్చయించి, తన పదవికి తిలోదకము లొసఁగి, ద్వితీయాశ్రమమును విసర్జించి, తురీయమును గ్రహించి, కొంతకాలము విరూపాక్షాలయ ప్రాకారమున నున్న విద్యారణ్యుని సన్నిధి వసించి, ఆశ్రమ నిర్మాణమునకు, దగిన ప్రదేశము మాల్యవంత పర్వతశ్రేణులఁ గనుఁగొని, అందాశ్రమమును నిర్మించుకొనెను. ఈతఁ డనుదినము హోమమును, విగ్రహముల కారాధనమును జరుపుచుండును. గ్రంథావలోకన మీతని నిత్యకృత్యము. తన యాశ్రమమున కేవేళ ఎందఱు యాత్రికులు వచ్చినను వారి నెల్లర మృష్టాన్నముల సంతృప్తిపఱచుట యీతని మొదటిపని. ఈతనికడ సమ్మోహనశక్తి గలదని ప్రతీతి. అగ్నిహోత్ర బలమునసే యీతఁడు సమస్త వ్యాధులను గుదుర్చుచుండెనఁట. వ్యాధిగ్రస్తు లెందఱో వీరిని దర్శించి, గుణము పొంది పోవుచుండిరి. ఈతఁడు 1–5–1939 తన భౌతిక దేహము చాలించెను.

మధువనము :

శంభునాథుని దివ్యమంగళ విగ్రహము నొకపరి మనఃఫలకమునఁ జిత్రించుకొని, యాత్రికుఁడా మహనీయుని దివ్య చిత్తమునకు శాశ్వత శాంతినిఁగూర్ప ఆ పరాత్పరుని ధ్యానించి, వెనుదిరిగి,

కాంపిల్యనగరమార్గమున మూఁడు ఫర్లాంగుల దూరము పోయినచో త్రోవకు కుడివైపున నొక యాలయము కానిపించును. అది–ఆంజనేయునిగుడి. దక్షిణాభిముఖము. గర్భగృహమున ఏకశిలానిర్మితమైన ఆంజనేయుని భవ్య విగ్రహము కలదు. ముందటి భాగమున మండప మున్నది. అచ్చట నొక 'గోసాయి' వసించి, దేవునిఁ బూజించుచు భక్తు లొసఁగు కానుకలచే నాతఁడు జీవయాత్ర సాగించు చుండును. ఆ యాలయమునకు చుట్టుఁబట్టులఁ గల ప్రదేశమే త్రేతాయుగము నాఁటి మధువనము. మారుతి, సీతాదేవి కుశలవార్తను గొనివచ్చి సంతోషాతిరేకమున సహచర వనచరులతోడ విచ్చలవిడి విహరించిన సుందరోద్యానము. వాలి సుగ్రీవుల పాదధూళిచేఁ బవిత్రవంతమైన పుణ్యభూమి.

తిమ్మప్పగుడి :

మధువనమునందలి ఆంజనేయాలయమునుండి కాంపిల్యనగర మార్గమున కొన్ని గజముల దూరము నడువగనే బాటకు కుడివైపున ఒక చిన్నని కాలిత్రోవ యగపడును. దాని ననుసరించి పోయినచో, అది యా సమీపమున గల కొండ పైభాగమును చేర్చును. అచ్చట నొక ఆలయము గలదు. గర్భాలయము అంధకారబంధురము. దీపము వెలిగించి చూచినను విగ్రహము స్పష్టముగ కనఁబడని కారణమున కొందరు దానిని హనుమంతుని విగ్రహమందురు; మఱికొందరు వేంకటేశ్వరుని విగ్రహమందురు. వేంకటేశ్వరునికి 'తిమ్మప్ప' యను నామము గలదు. అది కారణముగ ఆ యాలయమునకు 'తిమ్మప్పగుడి' యను పేరు సిద్ధించియుండవచ్చును.

ఈ మార్గమున చూడఁదగిన శిథిలము లివి.

## 3

# అంతఃపురావరణమార్గము

( కమలాపురమునందలి సత్రము – దండనాయకుని ప్రహరి )

### చంద్రశేఖరదేవాలయము :

ఈ మార్గమున, వాయవ్యభాగమున, కొంతదూరము పోయిన పిదప దారికి కుడివైపున కొన్ని గజములదూరమున ఈ యాలయము కలదు. ఇదియును కాంపిల్యానగర మార్గమునఁ గల గానిగిత్తి దేవాలయమును సమరేఖయందున్నవి. దీని సింహద్వారము పూర్వాభిముఖము. ద్వారముపైని గోపురముః గలదు. గోపురమును, చుట్టునుగల గోడయును ఖిలరూపమున నున్నవి. గర్భాలయమునకు దక్షిణభాగమున శిథిలమైయున్న రెండు మంటపములు గలవు.

### రాజ్ఞీ స్నానమందిరము :

చంద్రశేఖరదేవాలయమునుండి వెనుదిరిగి, ప్రధానమార్గము ననుసరించి కొన్ని గజముల దూరము నడచిన తరువాత దారి రెండు పాయలుగాఁ జీలును. అందు, ఎడమచేతివైపు దారి పంపాపురమునకుఁ బోవును. కుడిచేతివైపు దారి అందందు మెలిదిరిగి అంతఃపురావరణమును జేరును. ఈ ప్రదేశమున వారికి కుడివైపున కనపడు కట్టడమే– రాజ్ఞీస్నానమందిరము. ఇది హైందవ మహమ్మదీయ శిల్పపద్ధతుల ననుసరించి కట్టఁబడియున్నది. వెలుపలిభాగము చూచుటకు సామాన్యముగా నుండును. లోపలి భాగము మనోహరముగా నుండును. దీనికి చుట్టును అగడ్తగలదు. ఇది చౌసాల. నాలుగువైపులను ద్వారములు గలవు. లోపలి భాగమున చుట్టును మహమ్మదీయ శిల్పపద్ధతి ననుసరించి కమానులుతీర్చి కట్టఁబడిన 'వరండా' కలదు. లోవైపున పైభాగమున పలు తెఱఁగులగు చిత్రములు గారతో చిత్రింపఁబడి యున్నవి. దీని మధ్యభాగమున సుందరమైన కృత్రిమక్రీడాసరస్సు గలదు. వలసినప్పుడు ఆ సరోవరమును తుంగభద్రా నిర్మలజలముచే నింపుటకు

అనువగు రాతి గొట్టము సరోవరము పైభాగమున తూర్పుదిక్కున అమర్చబడియున్నది. ఈ సరస్సు ముప్పది యడుగుల పొడవును, అంతియ వెడల్పును, ఏడడుగుల లోతును గలిగియున్నది. ఉత్తర దిశయందు సరోవరములోనికి దిగుటకు అనువైన రాతిమెట్లు గలవు.

ఇది – అంతఃపురభవనమునకు అరమైలు దూరమున నుండుట వలనను, అంతఃపురావరణమున సహితము వేఱొక కొలనుండుటచేతను రాణులు ప్రతిదిన మందలి కొలఁకునందు మాత్రమే స్నానమాచరించుచు పర్వదినసములందు వార లీ మందిరమునకు తమభర్తతో నరుగుదెంచి, జలక్రీడలు సలుపుచుండిరని ఊహింపవచ్చును.

రాతితొట్టి :

ఇది చంద్రశేఖరదేవాలయమునకును, రాజ్ఞీ స్నానమందిరమునకును రమారమి మధ్యభాగమున నున్నది. పంపకుఁ బోవు మార్గమున నిలువఁబడి యీ తొట్టికి దక్షిణభాగమునఁ జూతుమేని యొక మంటి దిబ్బయు, కొన్ని శిథిలభాగములును కనఁబడును. ఆ దిబ్బకడకేగి, దాని పైభాగమున నిలువఁబడి, దక్షిణదిశగాఁ జూచినచో ఏఁబది గజముల దూరమున ఒక పాడుపడిన పెద్ద బావి యగపడును. ఆ కాలమున ఆ బావినుండి ఏతాముల మూలమున నీటిని తోడి, ఇట్టి రాతి తొట్లయందు నిలువఁజేసి, వీనినుండి రాతిగొట్టములద్వారమున నీటిని పట్టణములోనికి కొనిపోవుచుండిరని తోఁచుచున్నది. అబ్దుర్ రజాక్ అను విదేశయాత్రికుని వ్రాతలుసహిత మీ విషయమును బలపఱచుచున్నవి.

అష్టకోణాకార మజ్జనశాల :

రాజ్ఞీస్నాన మందిరమునుండి పంపాపుర మార్గమున రెండు ఫర్లాంగుల దూరముపోయిన, త్రోవనానుకొని, వాయవ్యదిశయందు అష్టకోణాకృతిగల మజ్జనశాల యగపడును. చూచుట కిది యించుమించుగా రాజ్ఞీస్నానమందిరమును పోలియుండును. రెండును, ఏక కాలమునఁ గట్టఁబడినట్లు తోఁచుచున్నది. దీనికి అన్నివైపులను కమానులు తీర్చిన వరండా గలిగి, లోపలిభాగమున ఒక చిన్నని

సరోవరము కలదు. దీనికి ఆకాలమున నీటిని గొనివచ్చు కాలువలును ఆ సమీపమున కనఁబడుచున్నవి. ఈ కట్టడముననే ఏకశిలా నిర్మిత మైన తొట్టియొకటి కలదు. పర్వదివసముల దాని నిండుగ పాలనునింపి బీదబిడ్డలకు పంచిపెట్టుచుండిరఁట. త్రోవ కెదురుగనున్న పొలము లలో వేరొక రాతితొట్టి కలదు. దాని చుట్టునున్న బండలపై బాట సారులు ఆహారము భుజించుట కనువుగ లోఁతులేని పల్లములు తొలు వఁబడి యున్నవి.

మజ్జనశాల :

ఇది చంద్రశేఖరదేవాలయమునకు ఉత్తరదిశయందు కొంత దూరమున నున్నది. ఇదియు అష్టకోణాకృతి గలిగి, రాజ్ఞీస్నాన మంది రమును పోలియున్నది. చుట్టును వరండా కలదు. దీనిలో వెలుపలి భాగములు చాలమట్టునకు శిథిలావస్థయం దున్నవి.

నీటికొలను :

అంతఃపురావరణ మార్గమున కొన్ని గజముల దూరము నడ చినపిదప త్రోవ కెడమవైపున ఈ కొలను గలదు. ఇది సామాన్య హైందవ శిల్పపద్ధతి ననుసరించి కట్టఁబడినది. చుట్టును, లోపలిభాగ మునను ఎట్టి కట్టడములును లేవు. ఇది నూఱు గజముల పొడవును, ముప్పదిగజముల వెడల్పును, ఎనిమిది యడుగుల లోఁతును గలిగి యున్నది. దీని సమీపముననే నగరములోనికి నీటిని కొనిపోవుటకై గండశిలలలోఁ దొలువఁబడిన నీటికాలువ తన తొంటి తేజమును కోలుపోయి, నామమాత్రావశిష్టమై వెలయుచున్నది. ఆ కాలువ నుండి ఈ సరోవరము వఱకు రాతి నీటిగొట్టములు రెండు శిథిలములై కనఁబడుచున్నవి. పరిచారికా బృందమునకును, రాజదర్శనార్థ మరు దెంచినవారికిని ఇది స్నానార్థము ఏర్పఱుపఁబడిన కోనేరని తోఁచు చున్నది.

సింహాసన మంటపము :

నీటికొలఁకునకు పరిసరముననే పై వివరించిన రాతికాలువ గలదు. దానికి ఉత్తరపుదిశయందు అత్యంతసమీపమున మహోన్నత

మైన సింహాసన మంటప శిథిలములుగలవు. 'పెయిస్' అను నాతఁడు ఆ మంటపమును 'విజయ మందిర' మని వ్యవహరించెను. ఇప్పుడు దానిని 'దసరాదిబ్బ' యనియు, 'మహానవమిదిబ్బ' యనియు పిలుచు చున్నారు.

అమూల్య రత్నఖచితమైన విజయనగర సామ్రాజ్య సింహాసన మిందు నెలకొల్పఁబడి యుండుటవలన 'సింహాసన మంటప' మనియు, శ్రీకృష్ణదేవరాయలు తన విజయాంకముగ దీనిని నిర్మించుటవలన 'విజయ మందిర' మనియు, మహానవమి పండుగు లిందు అత్యంత వైభవముగ జరుగుటవలన 'మహానవమి (దసరా) దిబ్బ' అనియు దీనికి పేళ్ళు గలిగెను.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1513 వ వత్సరమున కటక పురాధీశ్వరుఁడైన ప్రతాపరుద్ర గజపతిని ఓడించి, విజయసూచక ముగ దీనిని నిర్మించెను. శిథిలములందు ఇప్పటికిని ఇట్టి కట్టడములు కొన్ని యెట కనపడుచున్నవి. కాని, ఇంతటి ఔన్నత్యమును, సౌందర్యమును, వైశాల్యమును, శిల్పకళానైపుణ్యమును గలది వేరొకటి కానరాదు. దీనికి తూర్పు పడమటి భాగములందు చిత్రాలంకృతము లైన కృష్ణశిలలు పొదుగఁబడి యున్నవి. దీనిని నగభాగ మెక్కిన పిదప చుట్టును తిరుగుట కనుకూలమైన రాతిచుంచుగలదు. దీని విశాల మైన పైభాగమున కొన్ని యడుగులు నడచినచో తూర్పుదెసయందు నేలమట్టమున నొకగది యగపడును. మంటపము పైభాగమునుండి ఆ గదిలోనికి పోవుటకు రెండువైపుల రాతి మెట్లు గలవు. అమూల్యమైన సింహాసన ముంచుటకు ఈ గది నిర్మింపఁ బడెనని కొందఱును, దసరా మహోత్సవకాలమున పూజ కొఱకు దేవతావిగ్రహ ముంచుట కిది కట్టఁబడెననిమఱికొందఱును ఊహించుచున్నారు. దీని అడుగుభాగమున, ఒక పార్శ్వమున, రాతిలో చెక్కఁబడిన యైదు విగ్రహములు కలవు. అవి పంచ పాండవుల రూపములని కొందఱు తలంచి, వానిని నేఁటికిని పూజించు చున్నారు. ఇందలి శిల్పకళ హజారరామాలయమునందలి శిల్పమును

బోలియున్నది. ఈ వేదికచుట్టును అమర్పఁబడిన ఱాలపై అనేక చిత్రములు చెక్కఁబడియున్నవి. ఆ కాలమునందలి జనుల వేషములు, వృత్తులు, వాహనములు మున్నగునవి చిత్రముగ చెక్కఁబడియున్నవి. మఱియు, యోధులు అశ్వగజాదుల నూరేగుచున్నట్లును, వారవనితలు నృత్యములు సల్పుచున్నట్లును, వారి అనుచరులు మృదంగాది వాద్యములు మ్రోయించుచున్నట్లును, మృగయులు మృగయావినోదమున మగ్నులై యున్నట్లును అనేకవిధములగు ప్రతిమలు చక్కఁగఁ దీర్చఁబడియున్నవి. వేదికకు దక్షిణపార్శ్వమున చెక్కఁబడిన చిత్రములు కడు రమణీయములై యున్నవి. ఈ దిబ్బ పదునైదడుగుల యెత్తును, ఎబ్బదియడుగుల చదరమును గలిగి యున్నది. ఆ కాలమున దసరా దినములలో విజయనగర రాజులు ఈ మంటపముపై స్వర్ణసింహాసన మధిష్ఠించి, అందు జరుగు పందెములను, మల్లయుద్ధములను వీక్షించుచుండిరి.

Nuniz describes this festival as follows* :—

"The first day they put nine castles in a piece of ground which is in front of the palace, which castles are made by the nine principal captains in the kingdom. They are very lofty and are hung with rich cloths, and in them are many dancing-girls and also many kinds of contrivances. Besides these nine, every captain is obliged to make each one his castle, and they come to show these to the king. Each one has his separate denice, and they all come like this during the nine days of the feast. The officers of the city are bound to come with their denices each day at night, just as in our festivals, and in these nine days they slaughter animals and make sacrifice. The first day they kill nine male buffaloes and nine sheep and nine goats, and thenceforward they kill each day more, always doubling the number; and when they have finished slaying these beasts, there come nine horses and nine elephants of the king, and these come before the king covered with flowers- roses- and with rich trappings. Before them goes the chief master

* The description given by Nuniz relates how this festival took place in the reign of Achyuta Raya (A. D. 1530—1542)

Vide—Hampi Ruins by A. H. Loughurst—Pages—57-59.

of the horse with many attendants, and they make salaam to the king. And when these have finished making their salaams there came from within priests, and they bring rice and other cooked edibles and water, and fire, and many kinds of scents, and they offer prayers and throw the water over the horses and elephants, just (as over preiests do with) holy water; and they put chaplets of roses on them. This is done in the presence of the king, who remains seated on a throne of gold and precious stones; he never sits on this except only this once in the year. And the king that now reigns does not sit on it, for they say that whoever sits on it must be a very truthful man, one who speaks the whole truth, and this king (Achyuta Raya) never does so, whilst this is going on there pass by the king fully a thousand women, dancing and posturing before him. After all the denices that have been prepared have been witnessed all the horses of the king pass by, covered with their silken trappings, and with much adornment of gold and precious stones on their heads, and then all the elephants and yokes of oxen in the middle of the arnea in front of the palace. After these have been seen there come thirty six of the most beautiful of the king's wives covered with gold and pearls, and much work of seed pearls, and in the hands of each a vessel of gold with a lamp of oil burning in it; and with these women were all the female servants and the other wives of the king, with canes in their hands tipped with gold and torches burning; and these then retire inside with the king. These women are so richly hedecked with gold and precious stones that they are hardly able to move.

In this way during these nine days they are compelled to search for all things which will give pleasure to the king.

The king has a thousand wrestlers for these feasts who wrestle before the king, but not in our manner, for they strike and wound each other with two circlets with points which they carry in their hands to strike with, and the one most wounded goes and takes his reward in the shape of a silk cloth, such as the king gives to these wrestlers. They have a captain over them, and they do not perform any other service in the kingdom. And after these nine days are finished the Rao (King) rides out and goes to hold a review of the troops of his captains. Within these nine days the

king is paid all the rents that he receives from his Kingdom; for, as already said, all the land belongs to the king, and from his hand the captains hold it.

ఈ మండపము పై భాగమునుండి చూచినచో - అంతఃపురావరణమును, అందలి మహోన్నతములైన కట్టడములును, రామాలయమును, ధననాయకుని భవనాంశములును ఇంపుగాఁ గనఁబడును.

రాతితలుపు :

సింహాసనవేదికకు ఉత్తరభాగమున, అత్యంతసమీపమున, దారిప్రక్కన ఒక రాతితలుపు గలదు. భూభాగమున పూడియుండిన యీ తలుపును పైకితీసిరి. ఇది - ఏకశిలానిర్మితము. ఎత్తు రమారమి పదియడుగులు. వెడల్పు మూఁడడుగులు. మందము ఎనిమిది అంగుళములు. రాతితోఁ జేయఁబడినదైనను కొయ్యపలకతోఁ జేయఁబడిన తలుపువలెనున్నది. దీని వెనుకభాగమున గడెవేయుటకు అనుకూలములైన రెండు పూములున్నవి. ఇది—యే భవనద్వారమో తెలుపుటకు తగిన యాధారములు లేవు.

రాజప్రాసాదము :

సింహాసనమంటపమునకు దగ్గఱగా పశ్చిమభాగమున, సొంపైన శిథిలభవనము కలదు. సింహాసనవేదికకును, రాజ సందర్శనశాలకును ఇది నడుమ నున్నది. దేవాలయ కుడ్యములపై చెక్కఁబడెడి చిత్రములిందు కానరావు. ఆలయమువలెఁగాక, ఇదియంతయు ఇటికతోడను, గారతోడను కట్టఁబడియున్నది. ప్రధానద్వారము ఉత్తరాభిముఖము. ఈ కారణములవలన నిది రాజభవనమై యుండవలయును. భూమిలో పూడియుండిన ఈ భాగము ఈవల పైకి తీయఁబడినది. దీనియెత్తు ఐదడుగులు.

నేలమాళిగ :

రాజప్రాసాదమును ఆనుకొని యొక చిత్రమైన భవనముకలదు. దీని పై భాగము—ప్రకృతము నేలమట్టమునకు సమముగానున్న కారణమున దగ్గఱకు పోవువఱకు నిది కనఁబడదు. దీని నిర్మాణక్రమము

చూడ నిది దేవాలయమా? భవనమా? అను సంశయము కలుగును. ఇది—పూర్వాభిముఖము. పైకప్పు రాతిబంధలతో అమర్చఁబడి యున్నది. కప్పునకు ఆధారముగా శిలాస్తంభములున్నవి. చుట్టును ప్రదక్షిణించుటకు అనువగు మార్గమున్నది. లోపలిభాగము అంధ కారబంధురము. ఈ కారణములవలన నిది దేవాలయమై యుండ వచ్చునని తోఁచును. కాని—దీనికి ఉత్తరభాగమున పైనుండి లోపలికి దిగుటకు మెట్లుగలవు. పై భాగమున కనఁబడెడి విఱిగిపోయిన దూలములును, కంబముల గుఱుతులునుచూడ దీని యుపరిభాగమున సహితఁ మొకభవనము కట్టఁబడియుండెనని ఊహింపవలసియున్నది. ఇది—సింహాసనమంటపమునకును, రాజప్రాసాదమునకును సమీపమున నుండుటచేతను, దీని కించుక దవ్వునసే హజారరామాలయ ముండుట వలనను, పరిమాణమున నిది మిక్కిలి చిన్నదగుటచేతను, దేవాలయ కుడ్యములపై సాధారణముగ చెక్కఁబడెడి ప్రతిమ లిందుఁ గానరాని కారణమునను ఇది దేవాలయముకాక, రహస్యాలోచన మందిరమై యుండనోపునని తోఁచుచున్నది. అవసరసమయములందు రాజు తన మంత్రులతో రహస్యాలోచనము జరుపుటకిది నిర్మింపఁబడియుండును.

ఆస్థానమంటపము :

నేలమాళిగకు ఉత్తరదిశయందు, రమారమి ఏఁబది గజముల దూరమున, ఈ విశాలమంటపము గలదు. ఇదియే – 'భువనవిజయ' మని పేరు వడసిన విజయనగరరాజుల సభాభవనము. ఉత్తరాభి ముఖము. దీని పై భాగమున తొలువఁబడిన కంబపుపల్లములనుచూడ వరుసకు పదివంతున పదివరుసల కంబము లిందమర్పఁ బడియుండె నని స్పష్టమగుచున్నది. అవి చిత్రాలంకార శోభితములైన దారు స్తంభములై యుండనోపును, ఇప్పుడు—పై భాగమును, కంబములును లేవు. పైభాగమునుచూచుటకు విశాలమై, సామాన్యముగానున్నది. దక్షిణ, పశ్చిమభాగములందు గోడలుకలవు. భవనోపరిభాగమునఁ గల అంతస్తును పోవుటకు అనువగు శిలాసోపానపంక్తి దక్షిణభాగ మున నిర్మింపఁబడినట్లు కనఁబడుచున్నది. ఈ భవనముకంటె ఉన్నత

మైన భవనము ఈ యావరణమున మరియొక్కటిలేదని ఆకాలమున విజయనగరమును దర్శించిన అబ్దుర్ రజాక్ అను పర్షియాదేశపు రాయబారి వ్రాసియున్నాడు. కావున, ఇది—దారునిర్మితమైన రెండు, మూడు అంతస్తుల భవనమైయుండవచ్చును.

యాత్రికుడు దీని సోపానములపై నడుగుపెట్టగనే, శ్రీకృష్ణదేవరాయని యొక్కయు, అల్లసాని పెద్దనాది కవీంద్రులయొక్కయు, దివ్యనామములు స్ఫురించి హృదయము పులకించును. కవిసార్వభౌముడగు శ్రీనాథుడు కనకాభిషేకమందినది ఇచటనే—పెద్దనకవి గండపెండేరమును గొన్నది ఇచటనే—ఆంధ్రభాషావధూటి సర్వాలంకారశోభితయై కులికినది ఇచటనే.

రాతితొట్టి :

ఆస్థానమంటపము అడుగుభాగమున, కొంతదూరమున, ఒక పెద్ద రాతితొట్టి కలదు. ఉత్తరాభిముఖము. ఏకశిలా నిర్మితము. నలువది యొకటిన్నర యడుగుల పొడవును, మూడడుగుల వెడల్పును, రెండడుగుల తొమ్మిదియంగుళముల మందమును కలిగియున్నది. తొట్టిని కడిగి, మురికినీటిని వెలికి ద్రోయుటకై అడుగుభాగమున ఒకవైపున తూము తొలువబడియున్నది. ఇది - రాజ సందర్శనాపేక్షులాలసులై చనుదెంచినవారి గుఱ్ఱములును, ఏనుగులును నీరు త్రాగుటకొరకు ఏర్పరుపబడియుండవచ్చును.

హజారరామాలయము :

రాతితొట్టిని ఆనుకొని సింహద్వారముకలదు. దానిని దాటినంతనే రామాలయ ప్రాకారము గోచరించును. ఈ యాలయము రాజసౌధమునకును, అంతఃపురావరణమునకును అత్యంత సమీపమున నున్న కారణమున ఇది విజయనగర రాజుల ప్రత్యేక ప్రార్థనాలయమని ఊహింపవలసి యున్నది. ప్రాకార కుడ్యములందలి శిల్పకళను చూడ నిదియును, సింహాసన మంటపమును ఏకకాలమున నిర్మింపబడినవని తోచక మానదు. శ్రీకృష్ణదేవరాయలు ఈ యాలయమును

క్రీ. శ. 1513 వ వత్సరమున (శా. శ. 1435 చైత్రశుద్ధ పంచమి) కట్టించినట్లును, ఆ వత్సరముననే రాయలు ఇందలి రామచంద్రమూర్తికి ఆరుగ్రామములును, వానితోఁగూడ సొంపూరి రాష్ట్రమునందలి తారూరును సూర్యగ్రహణకాలమున ధారపోసినట్లును ఇందలి శిలాశాసనమువలన తెలియుచున్నది.

ఇది చూచుటకంత పెద్దది కాకపోయినను హైందవ శిల్పకళానైపుణ్యమును వేనోళ్ళ చాటుచున్నది. ఇందు—రామచంద్రుని గుడియు, అమ్మవారి శాలయుఁగలవు. వీనికి చుట్టునుండు ప్రాకారము రెండువందల యడుగుల పొడవును, నూటపది యడుగుల వెడల్పును గలది. ఆలయము పూర్వాభిముఖము. దేవాలయ కుడ్యములందును, ప్రాకారము లోపలిభాగమునను భాగవత రామాయణముల కథావిశేషములు అత్యంత సుందరముగ చిత్రింపఁబడియున్నవి.

గర్భాలయమునకు ముఖమంటపము గలదు. దాని పైకప్పు నాలుగుకంబముల యాధారమున నిలువఁబడియున్నది. ఆ కంబములు నునుపుచేయఁబడిన నల్లని రాళ్ళతో చేయఁబడినవి. వానియందలి పనితనము వర్ణనాతీతము. ఇది వైష్ణవాలయమయినను దీని కంబములపై అందందు శైవచిత్రములు చెక్కఁబడి యున్నవి. విజయనగరరాజులు శైవ వైష్ణవ మతములను సమానభావముతో ఆదరించుచుండిరని తెలుపుట కిది ప్రబల నిదర్శనము. ఈశాన్యదిశయందలి స్తంభముపై కల్కి స్వరూపమును అత్యంత రామణీయకముగా శిల్పి చిత్రించెను. మయూరవాహనుఁడగు సుబ్రహ్మణ్యుఁడు, వినాయకుని చెంగట పద్మాసనాసీనులయి యున్న తీర్థంకరులు మున్నగువారి చిత్రములు ఈకంబములపై ముద్దులొలుకునట్లు తీర్చఁబడి యున్నవి. గర్భాలయము పై భాగమున గారతోఁ గట్టఁబడిన గోపురము కలదు. గర్భాలయమునకు ఉత్తరభాగమున పూర్వాభిముఖమై అమ్మవారి శాల గలదు. ఇది—పరిమాణమున చిన్నది. కాని, శిల్పకళను చాటుటయందు దొడ్డది. ఈ యాలయముల రెండింటిలోను రాతి నీటిగొట్టములున్నవి. ఆవరణమున వేరుగ కళ్యాణమంటప మున్నది.

టంకసాల :

రెండవ దేవరాయని కాలమున విజయనగరమును దర్శించిన అబ్దుర్ రజాక్ దండనాయకుని కోటకు వెనుకభాగమున టంకసాల కలదని వ్రాసియున్నాఁడు. ఆస్థానమంటపమునకు నైఋతిభాగమునను దండనాయకుని కోటకు వెనుకవైపునను బలిష్ఠములైన గోడలు గలవు. ఆ గోడల మధ్యప్రదేశమే టంకసాలయై యుండును. ఇందిప్పుడు దీని చిహ్నములేవియుఁ గానరావు. ఇచ్చట విజయనగర సామ్రాజ్యము నందు చలామణీయగుచున్న నాణెము లన్నియు ముద్రింపఁబడుచుం డెను.

దండనాయకుని కోట :

హజారరామాలయమునకు పశ్చిమభాగమున బలిష్ఠములైన కుడ్యములతో ఆవృతమైన విశాలప్రదేశము కలదు. దీనినే ధననాయకుని ప్రహరి యందురు. ధననాయకుఁడే విజయనగరరాజుల సర్వసేనాని. ఈ యావరణమున రెండుపునాదులు, బహుస్తంభనిర్మితమైన భవనము, రక్షకభట గోపురము మున్నగు కట్టడములు కలవు.

ఈ ప్రహరి లోపలిభాగమున కనఁబడెడి విశాలమైన పునాదియే—దండనాయకుని భవనమైయుండనోపును. దీనిపై భాగమిప్పుడు లేదు. దారు నిర్మితమై, కాలక్రమమున నశించియుండును. ఆవరణమున, ఆగ్నేయ భాగమున, బహుస్తంభ నిర్మితమైన భవనము కలదు. దీనిని చూడఁగనే - సభామంటపమా? మసీదా? అను సంశయము కలుగును. దీనికి మూఁడువైపుల గోడలు గలవు. అడుగు భాగము శిలానిర్మితము; పై భాగము ఇటికతోడను, సున్నము తోడను, గట్టఁబడినది. ఈ నిర్మాణమున, హైందవ-మహమ్మదీయ శిల్పకళలు ఉట్టిపడు చున్నవి. రెండవ దేవరాయలు తన నగరమున మహమ్మదీయుల కొఱకు ఒక మసీదును గట్టించెనని 'ఫెరిస్తా' తెలిపి యున్నాఁడు. మసీదును పోలిన కట్టడము మఱెచ్చటను శిథిలము లందు లేకపోవుటచేత ఇదియే–దేవరాయలు కట్టించిన మసీదని నిర్ధారింప వలసి యున్నది. కాని, ఇది–ఉత్తరాభిముఖము. ఆరాధనకు

అనువగు నిండలి నడిమిగుడి (మెహరాబ్) మక్కా వైపును చూపు చున్నది. ఈ విషయములు రెండును మహమ్మదీయ మసీదు నిర్మాణ పద్ధతికి విరుద్ధములు. వీనిని పాటింపనిచో—ఇది మసీదని యెంచుటకు ఎంతమాత్రమును సంశయములేదు. దీనికి పడమటి భాగమున మఱి యొక పునాది కలదు. దీని నిర్మాణము పూర్తియైనట్లు తోఁచదు. మసీదునకును, దీనికిని మధ్యభాగమున గోపురాకారముగల యొక భవనము కలదు. అది గారతోఁ నిర్మింపఁబడినది. దీని పైభాగమునకు పోవుటకు అడుగు భాగమునుండి మెట్లుగలవు. దీనిని 'వాద్యగోపుర' (*Band Tower*) మని పిలుతురు.

ఈ యావరణమునకు వాయవ్యదిశయందు మహమ్మదీయ శిల్పము ననుసరించి కట్టఁబడిన రక్షకభట గోపురము గలదు. ఇది-శిలానిర్మితము. మిక్కిలి బలిష్ఠమైనది. అడుగుభాగమున నొక గది గలదు. పై భాగమునకు పోవుటకు రాతితోఁ గట్టఁబడిన యిఱుకైన మెట్లుగలవు. శిఖరమునందలి పశ్చిమభాగమున మూఁడరలుగల గది యొకటిగలదు. ఇందొక వెడల్పు కిటికీకలదు. దీనిని పోలినకిటికీ మఱియొకటి ఉత్తరదిశయందున్నది. కిటికీలు రెండును తిన్నెలపై నిర్మింపఁబడినవి. ఈ తిన్నెలయొక్కయు, కిటికీలయొక్కయు వైఖరిచూడ నివి తుపాకులుంచుటకు నిర్మితములై యున్నట్లు తోఁచుచున్నది. పశ్చిమభాగపు కిటికీ పైపునున్న రెండుగదులలో నొకటి భటుల నివాసమునకును, రెండవయది మందుసామానుల నుంచుటకును కట్టబడినట్లు ఊహింపవలసి యున్నది. ఎక్కువ మందుసామాగ్రి పునాదియందు నిర్మింపఁబడిన గదిలో నిలువఁ జేయుచుండిరి. దీని ద్వార మిప్పుడు మూసివేయఁబడినది.

అంతఃపురావరణము :

పాలుంగ దేవాలయమునకు ఉత్తరదిశయందు, కొంతదూరమున, మహోన్నతప్రాకారము గలదు. దీని లోపలిభాగమున అంతఃపురాది భవనములుగలవు. పూర్వ మీయావరణమునకు మూఁడు ద్వారములు మాత్రముండినవి. ప్రధానద్వారము పశ్చిమాభిముఖము.

ఇది-ప్రాచీన పద్ధతిననుసరించి కట్టఁబడియున్నది. ఈవల, ప్రభుత్వము వారు, యాత్రికుల కనుకూలముగా, ఈయావరణమునకు పూర్వ దక్షిణ భాగములయందలి గోడలలో రెండుద్వారములను తొలిచిరి.

ఆవరణమునకు మధ్యభాగమున విశాలమైనచప్టునాది కలదు. అదియే-రాజ్ఞీమందిర (*The Queen's Palace*) మై యుండును. అది రాజ్యాంగ కార్యస్థాన (*Divan Khana*) మని కొందఱియూహ. మహోన్నత ప్రాకారకుడ్యములు, రక్షకగోపురములు మున్నగు నందలి కట్టడములను చూడ అంతఃపురాంగనలు వసించెడి ప్రదేశమని స్పష్టముగఁ దెలియుచున్నది. కావున, కార్యస్థానమని తలంచుట కెట్టి యాధారమును లేదు.

ఆవరణమునకు ఉత్తరదిశయందును, ఆగ్నేయభాగమునను రెండున్నతములైన రక్షకగోపురములున్నవి. అందు - ఉత్తరదిశ యందుఁగల గోపురము మహోన్నతమైనది. చూచుటకు దీనికన్న ఆగ్నేయభాగమునఁ గలది మిక్కిలి యందముగా నుండును వీని యడుగుభాగమునుండి పైభాగమునకు పోవుటకు అనుకూలమైన మెట్లు గలవు. పైభాగము చల్లనై యాత్రికుని పథికాయాసముఁ బాపును. అచ్చట నిలువఁబడి చూచినచో ఆవరణమునకు చుట్టుఁబట్టులఁగల మనోహరదృశ్యములు గోచరించును. ఇవి కేవలము రక్షకగోపురములే కాక, అంతఃపురాంగనలు అందు వసించి, తమ్మితరులు చూడకుండ బయటివింతలను చూచుట కనువుగ నిర్మింపఁబడినవని తోచుచున్నది. తూర్పుభాగమున సహితమొక రక్షకగోపురము గలదు. అది యంత ఎత్తైనదికాదు. దీనిప్రక్కనే ప్రభుత్వమువారు ప్రాకారకుడ్యమున తొలిచిన ద్వారముకలదు. ఈగోపురము పైభాగమునుండి చూచి నచో గజశాల మున్నగు భవనములు కానుపించును. ఇది కేవలము కావలివాండ్రకొఱకు నిర్మింపఁబడియుండును.

అంతఃపురావరణమునఁ గల సుందరతరభవనము కమల మందిరము. ఇది నేఁటికిని చెక్కుచెదరక చూచుట కెంతయు నందముగా నున్నది. హైందవ, మహమ్మదీయ శిల్పకళలచే విరాజిల్లుచున్నది.

దీని క్రిందను ఎత్తైన శిలానిర్మిత మగు పునాది కలదు. ఇది-రెండంతస్థులమేడ. భవనమంతయు బలమైన కంబములతోడను, కమానుల తోడను కట్టబడియున్నది. పై భాగమునకు పోవుటకు ఉత్తరదిశయందు ఇఱుకైన మెట్లు గలవు. భవన నిర్మాణము పూర్తియైనపిదప సోపానములు నిర్మింపబడెనని తోచుచున్నది. ఇది-చుట్టును గోడలు లేని బాహాటభవనము. స్తంభములు, కమానులు మాత్రము మహమ్మదీయశిల్పానుసారముగ నుండుటచే, మిగిలిన నిర్మాణమంతయు హైందవ శిల్పమును సూచించుచున్నది. మేడ పైభాగము వికసిత కమలమును పోలియుండుటవలన దీనికి 'కమలమందిర' (*The Lotus Mahal*) మను పేరు గలిగియుండవచ్చును. మేడ పైభాగమునం గల పనితనము వర్ణనాతీతము. చుట్టును చిన్నచిన్న కిటికీలు గలవు. పూర్వము వీనికి కొయ్య తలుపులుండినట్లు తెలియుచున్నది. అబ్దుర్ రజాక్ వ్రాసినట్లు ఈ కట్టడములు రాజనగరమునకు సమీపమున నుండుటవలన నివి తప్పక రాణీవాసమునకు సంబంధించిన వని యూహింపవలసి యున్నది. అవసర సమయములందు రాజు ఈ భవనమునకు అరుదెంచి, రాణులతో సంప్రదించి పోవుటవలనం గాబోలు దీనికి 'మంత్రాలోచన మందిర' మను పేరు సహితము కలిగెను.

ఈభవనమునకు నైఋతిభాగమున నొక కృత్రిమ సరోవరము గలదు. దీని మధ్య నొక మండపము గలదు. రాజు లీ సరోవరమున ప్రతి దినము స్నానము సలుపుచుండిరి, పర్వదినముల మాత్రము రాజ్ఞీస్నాన మంటపమున కేగి రాణులతో జలక్రీడ లాడుచుండిరని వ్రాసియుంటిని. ఇప్పుడు-ఇందు ప్రభుత్వమువారు విఱిగిపోయిన విగ్రహములను భద్రపఱచినారు.

ప్రధాన ద్వారమునకు సమీపమున, ప్రాకారకుడ్యము నాను కొని, ఒక విశాలభవనము కలదు. దీని లోపలిభాగమున చుట్టును ఎత్తైన వేదికయును, దానిపైం గట్టబడిన కమానులును గలవు. రాణీ వాసమున పనిచేయు పరిచారికలు విశ్రాంతి గైకొనుట కిది నిర్మింపం బడియుండును.

గజశాల :

అంతఃపురావరణమునకు వెలుపలి భాగమున, తూర్పుపార్శ్వ భాగమున ఈ గజశాల గలదు. పశ్చిమాభిముఖము. ఇందు – పదు నొకండు ఏనుఁగులను గట్టుటకు అనువగు విశాలమైన గదులు పదు నొకండు గలవు. వీని పై భాగమున నమ్మటపు టాకారము గల గోపురములు గలవు. వీని నిర్మాణము చాలమట్టునకు మహమ్మదీయ శిల్పపద్ధతి ననుసరించి యున్నది. మధ్య గోపురముమాత్రము చతురస్రమై, ఉన్నతమై, శిథిలమై కనఁబడుచున్నది. వీని క్రిందిభాగము నందలి గదినుండి పైకి పోవుటకు మెట్లు కలవు. గదుల ముందుగోడ లందు మావటీండ్రు కూర్చుండుట కనువగు ప్రదేశములు కట్టబడి యున్నవి. ఉత్సవసమయములందు ఊరేగించెడు గజములు మాత్ర మిందుఁ గట్టఁబడుచుండెననియు, పట్టపుటేనుఁగునకు మధ్యభాగమున నున్న విశాలమైన గది నిర్మింపఁబడెననియు తెలియుచున్నది.

భ ట శా ల :

ఇది– గజశాలకు సమీపమున దక్షిణాభిముఖమై యున్నది. ముందటివైపున ఎత్తైన, విశాలములైన రెండు తిన్నెలుగలవు. ఆ వేదికల పై భాగమున పదునొకండు కమానుల వసారా యున్నది. లోపలి భాగమునసహితము చుట్టును ఉన్నతమైన వేదికయు, దానిపై నాలుగు వైపుల కమానుల వసారాయు కలిగి, అంతఃపురావరణమునఁగల పరిచారికాగృహమును పోలియున్నది. మధ్యభాగమున నిడుచదరపు పల్లము కలదు. నడిమికప్పు శిథిలమైనది. ఈ భవనమును కొందఱు 'ధర్మశాల' యందురు. కాని, అట్టి యూహ నిరాధారము. దీనికి సమీపముననే అంతఃపురమును, ప్రధానమైన గజశాలయు నుండుట వలన ఇది వాని రక్షణార్థము భటులు నివసించుటకై నిర్మింపఁబడిన దియై యుండును.

గజశాలకు కొంతదూరమున, తూర్పువైపున, రెండు దేవాలయములు ఖిలరూపముల నున్నవి.

రంగస్వామి దేవాలయము :

అంతఃపురావరణమునకు వెలుపల, దక్షిణదిశయందు ఈ ఆలయమున్నది. పూర్వాభిముఖము. చాల మట్టునకు భూభాగమున పూడియున్నది. దీనికి దక్షిణభాగమున రంగమంపము గలదు. ఇందు రమారమి తొమ్మిది యడుగులు నిడివి గల భవ్యమైన మారుతీ శిలావిగ్రహము కలదు. ఈ విగ్రహమున కెదుటనున్న గోడలోపలిభాగమున ఒక శిలాశాసనమున్నది. అది ప్రాత కన్నడపు టక్షరములలో వ్రాయఁబడియున్నది. "అందు-మాధవరాజు మల్లరాజుగారి మనుమఁడు వల్లభరాజుగారి కుమారుఁడు – మహామండలేశ్వరుఁడు – తిమ్మరాజు, సదాశివరాయల కాలమున శా. శ. 1468 వ విశ్వావసునామ (క్రీ. శ. 1546 వ) సంవత్సర చైత్రశుద్ధ తదియ గురువారమునాఁడు విద్యానగరమునందలి పెద్ద యంగడి వీధిలో మైలసంతకు పడమటనుండు మాధవదేవునకు తన తలిదండ్రులగు వెంగళమ్మ-వల్లభరాజుల జ్ఞాపకార్థమై ఆ చంద్రస్థాయిగ నిత్యోత్సవములయందు, నృత్యగీత వాద్యాది వైభవాదులకు యోగ్యముగ ఇరువదినైదు అంకణములుగల విశాలమైన రంగమండపము నిర్మించినట్లు గలదు." కాని, ఇప్పుడంత మండపము కానరాదు. కొంత భాగము భూగర్భమున లీనమయి, మఱికొంతభాగము శిథిలమైయుండ నోపును. ఈ శాసనమువలన ఆ కాలమున, ఈ ప్రదేశమున మైలసంత జరుగుచుండెననియు, రంగస్వామి మాధవదేవుఁడని పిలువఁబడుచుండెననియు తెలియుచున్నది.

దఫ్తర్ ఖానా :

ఈ కట్టడములకు ఎదురుగా అబ్దుర్ రజాక్ తెల్పిన 'దఫ్తర్ ఖానా' అనఁబడు మంత్రిశేఖరుని సభామంటపము కలదు. ఇది రాయల సౌధమునకు కుడివైపున నున్నట్లు ఆతఁడు సూచించియున్నాఁడు. ఇప్పుడా భవనము లేదు. కొన్ని శిథిలములుమాత్రము ఆ ప్రదేశమునఁ గనఁబడుచున్నవి. ఈ విశాల మంటపమునకు నలువది స్తంభము లుండెనఁట. దీని కెదురుగ మనుష్యునికంటె ఎత్తైన వసారా

యుండెననియు, అవి యించుమించుగా ఇరువదిగజముల పొడవును, ఆరుగజముల వెడల్పును గలిగియుండెననియు రజాక్ వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.

పట్టద యెల్లమ్మగుడి :

రంగస్వామి దేవాలయమునకు నైరృతిభాగమున కొంతదూరమున ఈ యాలయము గలదు. ఈమె పొలిమేర దేవత. కురబవాండ్రు ఈమె నిప్పటికిని పూజించుచున్నారు. ఇది- ప్రాచీనకాలమునాఁటి ఆలయము. శిల్పకళ లేదు. భూమట్టమునకు క్రిందిభాగమున కట్టఁబడి యున్నది. దీనిని సయితము విదేశయాత్రికులు తమ వ్రాఁతలయందు పేర్కొనిరి.

ఒంటిగుండు పడసాల :

గజశాలకు దక్షిణమునను, సింహాసనమంటపమునకు తూర్పునను ఒకఫర్లాంగు దూరమున నిది కలదు. శిల్పి యొక పెద్దగుండును తొలిచి, లోపలిభాగమున ఒక చిన్నని యాలయమును, దానికి ముందొక పడసాలయు, దాని పార్శ్వతలమున మఱియొక పడసాలయు నిర్మించెను. పై మూఁడును ఒకే బండయందు తొలువఁబడియున్నవి. ఆలయద్వారమునకు పైభాగమున గజలక్ష్మి ప్రతిమయు, ఈవల ఆవల సూర్యచంద్ర విగ్రహములును చెక్కఁబడియున్నవి.

ఈమార్గమున చూడఁదగిన శిథిలము లివి.

౪

# పంపాపుర మార్గము

[ దండనాయకుని ప్రహరి – విరూపాక్షాలయము ]

## భూగర్భ దేవాలయము :

దండనాయకుని ప్రహరి ప్రక్కనుగల త్రోవ ననుసరించి పశ్చిమదిశగా కొన్ని గజముల దూరము పోయినపిదప, భూగర్భ దేవాలయము కనబడును. దీని చెంగటనే కమలాపురము నందలి సత్రము నుండి పంపాపురమునకుపోవు ప్రధానమార్గము కలదు. ప్రభుత్వము వారు భూమిలో పూడియుండిన ఆలయమును వెలుపలికి తీయుటవలన దీనికి 'భూగర్భదేవాలయము' మను పేరుగలిగెను. దీనినే కొందఱు "ప్రసన్నవిరూపాక్షాలయ" మనియు, మఱికొందఱు "పాతాళ శివాలయ" మనియు పిలుచుదురు. ఎల్లవేళల శివలింగము నీటిలో నుండవలయునను ఉద్దేశముతో భూమట్టమునకు చాల క్రిందిభాగమున నిది నిర్మింపబడినట్లు తోచుచున్నది. ఎల్లప్పుడును గర్భాలయమున నీరు ఊరుటచే దర్శనమునకు బాధకముగనున్నది. ఆలయములోనికి పోవుటకు పైనుండి మెట్లుగలవు. ఆలయమునకు ఈశాన్యభాగమున నాగశిలలనేకములు ప్రతిష్ఠింపబడి యున్నవి. ఆకాలమున అందు నాగార్చన మెక్కువగ జరుగుచుండెనని తెలియుచున్నది. తూర్పువైపునగల మహాద్వారము శిథిలమై కూలిపోయినట్లు అగపడును. ఆకారణమున నిది గోపురములేనట్లు కనబడుచున్నది. ఆలయమున విగ్రహములేదు. కాని, ఒక పెద్ద నంది కలదు. ఇచటి శిలాశాసనములలో నొకదానియందు ప్రసన్నవిరూపాక్షునికొసంగిన దానములను పేర్కొని యుండుటవలన ఇదియే ప్రసన్నవిరూపాక్షాలయమని యూహింపవలసి యున్నది. కాని, ప్రసన్నవిరూపాక్షాలయమని పిలువబడు ఆలయమిప్పుడు హేమకూట పర్వతమునందుగలదు. శిథిలములందింకను ఇట్టియాలయములెన్ని భూగర్భమున లీనములై యున్నవో ఎవరి కెఱుక!

అక్క-సెల్లెండ్ర గుండ్లు :

భూగర్భ దేవాలయమునుండి పంపాపురమార్గమున కొన్నిగజ ములదూరము పోయినచో మీఁది అంచులొకటితో నొకటి కలిసిన రెండు గండశిలలు కానిపించును. వీనికి 'అక్క-సెల్లెండ్రగుండు' లని పేరు. ప్రాచీనయుగములందిది ఘోరారణ్యప్రదేశ మైయుండుటవలన శాపవశమున రాక్షసాంగన లిరువురు చక్రతీర్థబంధితలై యిచ్చట నెలసియుండురు. ఇవి-రమారమి పదిపదియడుగుల ఎత్తుగలిగి, ఘనరాకారము నొందియున్నవి. ఈవలయము ప్రక్క-గ దారి ఏర్పడినది.

ఉద్దాన వీరభద్రమనిగుడి:

చక్రతీర్థ బంధలనుండి అరమైలుదూరము నడచినపిదప, దారి రెండుదేవాలయములకు మధ్యభాగమున పోవును. అందు, తూర్పు దిక్కు-నఁగల దేవాలయము 'ఉద్దానవీరభద్రునిగుడి'. ఇందు-మహో న్నతమైన వీరభద్రుని భవ్యవిగ్రహము కలదు. ఇతఁడు శివుని కుమారులలో నొకఁడు. రౌద్రమూర్తివహించిన మహేశ్వరుఁడు తనజడను పెఱికి నేలనుగొట్టఁగా నితఁడు జనించెనని పురాణములు తెలుపుచున్నవి. క్రీ. శ. 1545-వ వత్సరమున సదాశివరాయల కార్యకర్తయైన రామరాజయ్య తమ్ముఁడగు ఎఱతిమ్మరాజయ్యయొక్క- దళవాయి జంగమయ్య కృష్ణాపురము సందిలి 'హిరియ' కాలువకు చాటున ముద్దు వీరణ్ణను ప్రతిష్ఠచేయించి, దేవుని పూజా పురస్కారములకు కొన్నిదానము లొసఁగెనని యిందుండు శిలాశాసనమున వ్రాఁయబడియున్నది. కావున, ఈదేవుని మొదటిపేరు ముద్దువీరణ్ణ; కాలక్రమమున 'ముద్దు' అనుపదము దేవుని భవ్యాకృతిని సూచించు 'ఉద్ద' ♦ యను పదముగా మాఱినది. మఱియు ఈయాలయమునకు చెంగట ప్రవహించెడి 'తురుత్తు' కాలువకు ఆకాలమున 'హిరియ' కాలువ యను నామముండెననియు, కృష్ణాలయమునకు దాపుననున్న యీప్రదేశమునకు 'కృష్ణాపురమని' మని పేరుండెననియు పై శాసనమువలనఁ దెలియుచున్నది.

---

♦ కన్నడమున 'ఉద్ద' యనిన 'ఎత్తు' అని యర్థము.

సహగమన చిహ్నములు:

ఉద్దానవీరభద్రాలయము వెలిగోడయందు రెండు సతీస్మృతి శిలలు స్థాపింపఁబడియున్నవి. వీనికి పశ్చిమభాగమున, దారికి ఆవల నైఋతిన, ఇట్టి శిల లనేకములు గలవు.

భర్త చనిపోయినప్పుడు ఆశవముతో భార్యను సహితము దహించుట పూర్వకాలమునందలి హైందవాచారము. ఈ యాచారము హిందూదేశమున అందందు వాడుకలలో నుండెను. కాని, సహగమన రంగమునకు విజయనగరము ప్రధాన భూమికయై యుండినట్లు గోచరించుచున్నది. సహగమన విధానమును ప్రజలకు సూచించుటకోయన ఇది రాలపై చెక్కఁబడియున్నది. ఇట్టిశిలలను 'మాస్తిశిల' లనియు, 'మహాసతిశిల' లనియు పిలుతురు.

* The following interesting account of sati as performed in Vijayanagar in the sixteenth century is taken from the "Chronicle Fernao Nuniz" Published in Mr. Sewell's "Forgotten Empire"— The women have the custom of burning themselves when their husbands die, and hold it an honour to do so when, therefore their husbands die they mourn with their relations and those of their husbands, but they hold that the wife who weeps beyond measure has no desire to go in search of her husband; and the mouring finished, their relations speak to them advising them to burn themselves and not to dishonour their generation. After that, it is said, they place the dead man on a bed with a canopy of branches and covered with flowers and they put the woman on the back of a worthless horse, and she goes after them with many jewels on her, and covered with roses; she carries a mirror in her hand and in the other a branch of flowers, and (she goes accompanied by) many kinds of music, and his relations (go with her) with much pleasure. A man goes also playing on a small drum and he sings songs to her telling her that she is going to join her husband and she answers also in singing that so she will do. As soon as she arrives at the place where they are always burned she waits with the musicians till her husband is burned, whose body

---

* **Hampi Ruins by A. H. Longhurst Pages 37-39.**

they place in a very large pit that has been made ready for it, covered with much firewood. Before they light the fire his mother (son?) or nearest relative takes a vessel of water on the head and a fire-brand in the hand, and goes three times round the pit, and at each round makes a hole in the pot; and when these three rounds are done breaks the pot, which is small and throws the torch into the pit. Then they apply the fire, and when the body is burned comes the wife with all the feasters and washes her feet, and then a brahman performs over her certain ceremonies according to their law; and when he has finished doing this, she draws off with her own hand all the jewels that she wears, and divides them among her female relatives, and if she has sons she commends them to her most honoured relatives. When they have taken off all she has on, even her good clothes, they put on her some common yellow cloths, and her relatives take her hand and she takes a branch in the other, and goes singing and running to the pit where the fire is, and then mounts on some steps which are made high up by the pit. Before they do this they go up three times round the fire, and then she mounts the steps and holds in front of her a mat. That prevents her from seeing the fire. They throw into the fire a cloth containing rice, and another in which they carry betel leaves, and her comb and mirror with which she adorned herself, saying that all these are needed to adorn herself, by her husband's side. Finally she takes leave of all, and puts a pot of oil on her head, and casts herself into the fiire with such courage that it is a thing of honour; and as soon as she throws herself in, the relatives are ready with firewoods and quickly cover her with it, and after this is done they all raise loud lamentations. When a captain dies, however many wives he has they all burn themselves, and when the king dies they do the same",

ఉద్దానవీరభద్రుని గుడికి అత్యంత సమీపమున, పంపాపుర మార్గమున త్రోవ కెడమవైపున ఒక దేవాలయము విగ్రహశూన్య మైయున్నది. దాని లోపలిభాగమున ఒక వైపున చౌడేశ్వరి దేవాలయము గలదు.

తురుత్తుకాలువ :

అటనుండి కొన్ని గజములదూరము పోయినచో ఈ కాలువ త్రోవ కష్టముగా ప్రవహించుచుండును. 'తురుత్తు' అను కన్నడ పదమునకు 'వేగ' మని యర్థము. అత్యంత వేగముగా ప్రవహించుటచే దీనికి 'తురుత్తు' కాలువయను పేరు గలిగెను. పంపాపురమునకు చెంగట ప్రవహించెడి తుంగభద్రానదికి కొంతదూరమున ఆనకట్టఁ గట్టించి, రెండవ బుక్క-రాయలు దీనిని నిర్మించెను. నాటిఁ నుండి నేఁటి వరకు ఈ కాలువ అవిచ్ఛిన్నముగ ప్రవహించుచు అనేక ఎకరముల భూమిని సాగుచేయుచున్నది. దీని నిర్మాణమునకు పూర్వము విజయనగరమున పానయోగ్యమగు నీరు లేకుండె ననియు, త్రాగుటకొఱకు నీరు ఆనెగొందినుండి తేఁబడుచుండెననియు న్యూనిజ్ వ్రాతల వలన తెలియుచున్నది.

నృసింహావిగ్రహము :

ఈ కాలువకు కొన్నిగజముల దూరమున, త్రోవకు పశ్చిమ దిశయందు కొంతదూరమున ఈ నరసింహావిగ్రహము గలదు. గర్భాలయము గోడమాత్రమున్నది. దీనికి పైకప్పును ముఖమంటపమును లేవు. దీని ముందటిభాగమునందున్న శిలాశాసనమువలన క్రీ. శ. 1528 వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయలు ఈ విగ్రహమును 'అర్యకృష్ణభట్టు'ను బ్రాహ్మణునిచే చెక్కించి, ప్రతిష్ఠించి, పూజాదులకు మాన్యములొసంగెనని తెలియుచున్నది.♦ ఇది యేక శిలానిర్మితమై, ఇరువదిరెండడుగులు పొడవు కలిగియున్నది. నృసింహమూర్తి ఆది శేషునిచుట్టపై కూర్చుండినట్లును, లక్ష్మీదేవి కుడిచేతిని తన విభుని కటిప్రదేశమును చుట్టి, యాతని యూరుభాగమున ఎడమవైపున కూర్చుండి యున్నట్లును, శేషఫణము ఆ నృసింహుని శిరోపరితలమున ఆవరించి యున్నట్లును మిగుల నైపుణితో చెక్కెను. శేషుని శిరమొక్కటి భిన్నమై యున్నది. విగ్రహము నాశికావిచ్ఛేదము నొందియు, రౌద్ర రసము మూర్తీభవించియున్నట్లు అగపడుచున్నది. లక్ష్మీస్వరూపము

♦ Epigraphia Indica, 1, 399

సహితము భిన్నమై యున్నది. నృసింహుని యొక్కయు, లక్ష్మీదేవి యొక్కయు భిన్నశిలాఖండములు ఇప్పటికిని ఆ ప్రదేశమునఁ బడి యున్నవి. ఈ విగ్రహము ఆచంద్రార్కముగ వెలయు ననుటకుఁ గాఁబోలు, విగ్రహము నెలకొల్పఁబడిన వేదికపై సూర్యచంద్ర ప్రతిమలు చెక్కఁబడి యున్నవి.

బడివే లింగము :

నరసింహ విగ్రహమునకు మిక్కిలి దగ్గఱగా, ఉత్తరపార్శ్వమున, ఒక చిన్న యాలయము కలదు. అందలి శివలింగము చాల పెద్దది. దీని యడుగుభాగము సదా నీటిలో మునిఁగియుండును. ఇది - యెవరికాలమున ప్రతిష్ఠింపఁబడెనో తెలుపుటకు తగిన యాధారములు లేవు.

కృష్ణస్వామి ఆలయము :

పైని పేర్కొనిన రెండు దేవాలయములను విడిచి పంపాపుర మార్గము ననుసరింపఁగనే, ఒక సింహద్వారము గోచరించును. దానిని దాఁటఁగనే, యించుక మెరకనేలపై ఉన్నత ప్రాకారకుడ్యములు అగపడును. ఇవియే - కృష్ణస్వామి దేవాలయపు ప్రహరిగోడలు. శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ 1513-వ వత్సరమున నెల్లూరు మండలములోని ఉదయగిరికోటను జయించి, అందలి ముద్దులాలుకు కృష్ణ విగ్రహమును కొనితెచ్చి, ఈ యాలయమును గట్టించి, ప్రతిష్ఠించెనని యందలి శిలాశాసనమువలనఁ దెలియుచున్నది. ఈ విగ్రహ మిప్పుడు చెన్నపురియందలి వస్తుప్రదర్శనశాల (*Museum*) లో నున్నది. ఈ యాలయ పరిసరప్రదేశము ఆ కాలమున 'కృష్ణాపుర' మని పిలువఁబడుచుండెను. దీనికి పూర్వభాగముననున్న మహాద్వారమునకు ఎదురుగా ఖిలరూపముననున్న శిలామంటపశ్రేణి నాఁటి నాల్గు పెద్ద బజారులలో నొక్కటి. ఈ వీధియందు కృష్ణస్వామి రథోత్సవము అద్భుతముగా జరుగుచుండెను. ఇది - యిప్పుడు సంపూర్ణముగ శిథిలమై, వ్యవసాయము చేయఁబడుచున్నది. ఈ గుడియందలి చెక్కడపు పని ఉత్కృష్టమైనది కాకపోయినను, మంటపమునందలి కంబముల

పైనను, గోడలపైనను ఉండు కృష్ణలీలల దృశ్యములు యాత్రికుని దృష్టిని ఆకర్షింపక మానవు. ఆవరణము లోపలిభాగమున చుట్టును మండపములు గలవు. ఆలయద్వారములు శిథిలములై గోపురాంచిత ములై యొప్పుచున్నవి. దక్షిణపార్శ్వమున మహమ్మదీయ శిల్ప ముతోనొప్పు బలిష్ఠమైన భవనము కలదు. స్వామికి సంబంధించిన అమూల్య వస్త్రాభరణాదులు ఇందు భద్రపఱచుచుండిరని తోఁచు చున్నది.

ఈ యాలయ మహాద్వారమునకు ఎట్టయెదుట, త్రోవకు కుడి వైపున, ఒక రాతితొట్టి గలదు. బాటసారుల ఉపయోగార్థము దానిని నీటితో నింపుచుండినట్లు తోఁచుచున్నది.

చిన్న విష్ణ్వాలయము :

కృష్ణస్వామి దేవాలయమునకు వెనుక భాగమున, త్రోవకు పడమటి వైపుయందు, రెండు చిన్న దేవాలయములు, ఉన్నత శిలా తలమున కట్టఁబడియున్నవి. అందొకటి – విష్ణ్వాలయము; రెండవది – గణేశాలయము. ఈ యాలయములనుండియే హేమకూట పర్వతమాలి కలు ఆరంభమగుచున్నవి. కదిరాంపురమునుండి పంపకుఁబోవు శాఖా పథము, పంపాపురమునకుఁబోవు ప్రధాన మార్గముతో ఈ యాలయము నకు ముందుభాగమునఁ గలియుచున్నది. విష్ణ్వాలయ మంత పెద్దది కాదు. శిల్పకళలేని రాలతోఁగట్టబడిన విచిత్రాలయము. ఇతర దేవా లయములందువలె ఇందు విగ్రహప్రతిష్ఠ లేదు. గుడి యడుగుభాగమున నున్న రాతిపై విష్ణుమూర్తి పాదములను ఆదిశేషుఁడు చుట్టుకొని యున్నట్లు మలఁచి శిల్పి తన ప్రావీణ్యమును చూపెను. ఈ పాదము లనే యాత్రికులు పూజింతురు. ఈ కట్టడము పదునాల్గవ శతాబ్ది యందు దక్షిణకన్నడము జిల్లాలో కట్టఁబడిన జైనాలయములను పోలి యున్నది.

సాసివికాళుగణేశ విగ్రహము :

విష్ణ్వాలయమునకు పైభాగమున కొంచెము ఎత్తైన ప్రదేశమున గణేశ విగ్రహమున్నది. ఎత్తు రమారమి పదియడుగులు. దీనికి 'సాసివి

కాళు గణేశ విగ్రహ'మని పేరు 'సాసివికాళు' అను కన్నడపదము నకు 'ఆవగింజ' యని యర్థము. మహోన్నతమైన విగ్రహమునకు ఈ పేరెట్లు సిద్ధించెనో తెలియదు. హాస్యమున కీపేరు గలిగియుండ వచ్చును. దీనికిచుట్టును గోడలులేని ఇరువదియెనిమిది కంబముల యాధారమున కట్టఁబడిన మంటపమున్నది. విగ్రహ వామహస్త మును, తొండమును ఖిలమైయున్నవి దీనికి ముందుభాగమున ప్రత్యేక శిలతో నిర్మింపఁబడిన చిన్న మూషికవాహన మున్నది.

కడలెకాళు గణేశాలయము :

సాసివికాళు గణేశాలయమునుండి కొన్నిగజముల దూరము పంపాపుర మార్గమునఁబోయిన కొన్ని శిథిలాలయములు గానిపిం చును. వానిలో పేర్కొనఁదగినది కడలెకాళు గణేశాలయము. ఇది- పూర్వాభిముఖము. శిల్పపుపనిలేని రాలతోఁ గట్టఁబడి, చూచుట కందముగానున్నది. గర్భాలయమునకు ముందుభాగమున ఇరువది నాలుగు కంబములుగల మంటపమున్నది. ఇచ్చట నిలువఁబడి ఈశా న్యభాగమునకుఁ జూచుచో హంపిబజారును, తుంగభద్రానదియు, అత్యంత రమణీయముగఁ గనఁబడును. కడలెకాళు గణేశుఁ డనఁగా సెనగగింజ పరిమాణముగల వినాయకుఁడని యర్థము. సాసివికాళు గణేశునకువలెనే ఈతనికిని హాస్యమున కీపేరు గలిగియుండవచ్చును. ఈ విగ్రహము దాదాపు పదునారడుగుల యెత్తు గలిగియున్నది. ప్రకృత మిది పూజాదులులేక గబ్బిలముల కావాసమై దుర్గంధభూ యిష్ఠమై యున్నది.

హేమకూట పర్వతము :

కడలెకాళు గణేశాలయమును ఆనుకొని పశ్చిమభాగమున ఈ పర్వతము కలదు. పంపాదేవి శ్రీ విరూపాక్షుని వివాహమాడఁదలఁచి యిందు తప మాచరించెనందురు. ఈ కొండపై కొన్ని దేవాలయ ములు కలవు. అందు కొన్ని జైనపద్ధతిని, మఱికొన్ని హైందవపద్ధతిని కట్టఁబడియున్నవి. అందు ప్రసన్న విరూపాక్షాలయమును, ప్రసన్నాఞ్జ నేయాలయమును, కాశీ విశ్వనాథాలయమును పేర్కొనఁ దగినవి.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1513 వ వత్సరమున ప్రసన్న విరూపాక్షునకు భూదానమొసఁగినట్లు అందలి శిలాశాసనమువలనఁ దెలియుచున్నది. మఱియొక యాలయమునందలి స్తంభముపై కంపిలరాయఁడు తన పితృ పితామహ ప్రపితామహుల జ్ఞాపకార్థముగ ఒక యాలయమును గట్టించి, అందు శివలింగమును ప్రతిష్ఠించెనని చెక్కఁబడియున్నది. ఈ యాలయము పై పేర్కొనిన ప్రసన్న విరూపాక్షాలయమై యుండవచ్చును.

శివరామావధూతాశ్రమము :

కడలెకాళు గణేశాలయమునకు వెనుకభాగమున, కొన్ని గజముల దూరమున, హేమకూట పర్వతమున ఒక చిన్నద్వారగ మగపడును. అదియే- శివరామావధూతాశ్రమద్వారము. అది ప్రాచీనమైనదికాదు. ద్వారము దాటఁగనే త్రోవ మలుపు తిరుగును. ఆ మలుపునకు ఎడమచేతివైపున ఇఱుకైన రాతిమెట్లవరుస కలదు. దానిననుసరించి క్రిందికి దిగినచో నిర్మల వారిపూరితమైన సరోవర మొండు గానిపించును. అందలి శీతలోదకమును కడుపారఁద్రావి, యాత్రికుఁడు మరల మూఁడు నాలుగు గజములు ముందునకు నడచినచో ఎడమచేతివైపున మరల నొకద్వార మగపడును. అదియొక గుహాద్వారము. శివరామావధూత నెలలకొలఁది యందు తప మాచరించుచుండెడివాఁడఁట. కుడివైపున గండశిలల యడుగుభాగమున భక్తు లాహారాదులను సిద్ధపరచుకొనుటకు అనువగు గదులు నిర్మింపఁబడియున్నవి. ఇంకను కొన్ని గజములు ముందునకు నడువ ఎట్టయెదుట అవధూత శిలావిగ్రహ మగపడును. అది యొక సుందరతర విశాలభవనమున స్థాపింపఁబడియున్నది. దాని కించుక వామ పార్శ్వమున ఒక చిన్న శిలామందిరము కలదు. అం దాతని ప్రధానశిష్యుఁడు వసించుచుండెను.

కాశీ విశ్వనాథాలయము :

శివరామావధూతాశ్రమమునకు ఇంచుక పడమటివైపున జైన బసదుల నానుకొని ఒక యాలయము కలదు. దానిని రామలింగేశ్వర

దేవాలయమనియు: హేమకూట గాయత్రీ పీఠమనియు వ్యవహరింతురు.

### జైన బసదులు :

ఈ పర్వతపు టుత్తరభాగపు వాలు కొంత దిగినతరువాత కొన్ని యాలయముల సమూహము అగపడును. నిర్మాణమున జైన పద్ధతి ననుసరించి యుండుటవలన నివి జైన బసదులని కొందరు తలంతురు. కాని, వీని గోడలపైనను, శిఖరములపైనను తీర్చియుండు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది విగ్రహములనుచూడ ఇవి శైవాలయములో వైష్ణవాలయములో నై యుండునని తోఁచుచున్నది. విజయనగర రాజులు హైందవ, మహమ్మదీయ, జైన మతములను సమాన భావమున ఆదరించినకారణమున జైనబసదులని యూహించుటకును తగిన యవకాశము లేకపోలేదు.

### పంపావతి దేవాలయము :

పై పేర్కొనిన ఆలయములకు తూర్పుభాగమున కొన్ని గజముల దూరమున ఒక శిథిలద్వార మగపడును. దానిని దాఁటి శిలాసోపానమార్గము ననుసరించి ఇంచుక ఉత్తరదిశగాఁ బోయిన విరూపాక్షాలయపు సింహద్వారము కానిపించును. ఈ ద్వారము పైభాగమున పదునొకండు అంతస్తులుగల గోపుర మున్నది. దక్షిణహిందూదేశమున ఎన్నఁదగిన గోపురములలో నిదియొక్కటి. విట్ఠప్పయను శిల్పి దీనిని నిర్మించుటవలన దీనికి 'విట్ఠప్పగోపుర' మను పేరు గలిగెను. ఇందలి పనితనము చెప్పనలవికానిది. లోపలిభాగము బోలుగానుండును. దీనినిగూర్చిన యొక వింతకథ గలదు. విట్ఠప్ప గోపురమును కట్టుచుండ పగలుకట్టిన భాగమంతయు తెల్లవారుసరికి పడిపోవుచుండెను. దాని కాతఁడు చింతాక్రాంతుఁడై ఒకనాఁటిరేయి నిద్రించుచుండ ఒక్క దివ్యమూర్తి స్వప్నమున గోచరించి, నిండుచూలాలి నొకతెను బలియొసఁగుచో నీ కట్టడము భిన్నము కాకయుండునని నుడివి కనుమొఱఁగెను అంత నాతఁడు మేల్కాంచి ఈ కార్య మెట్లు కొనసాగునని చింతించుచుండ నవమాసపు [illegible] నాతని కోడలు

మామను చేరఁబోయి 'ఏల మీ రిట్లు విచారపడుచున్నా'రని గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను. విట్టప్ప యామె కప్పటి స్వప్నవృత్తాంతము వినిపించెను. అంతట నా ఘణ్యావతి ఎంతయు సంతసించి 'నే నందులకు సంసిద్ధను. వేరుగ భావింపక నన్ను బలియొసఁగి కృతకృత్యులగుకండు' అని మామను ప్రార్థించెను. గత్యంతరములేక విట్టప్ప యందులకు సమ్మతించి ఆమెను బలియొసఁగి గోపురమును నిర్మించెను. ఆమె జ్ఞాపకార్థము 'గోపురమ్మ' యను శిలావిగ్రహమును మొదటియంత స్తున ప్రతిష్ఠించి నేఁటికిని పూజించుచున్నారు.

ఈ యాలయమునకు బలిష్ఠములైన కుడ్యములచే నిర్మితములగు ప్రాకారములు రెండు కలవు. సింహద్వారము దాఁటఁగనే కనఁబడునది బహిరావరణము. దీని మధ్యభాగమున తుంగభద్ర కాలువ ఎల్లప్పుడు ప్రవహించుచుండును. లోపలిభాగమున ప్రాకారకుడ్యముల నానుకొని కొన్ని మంటపములు గలవు. నైఋతిభాగమున నిర్మితమైన మంటపము అసంఖ్యాక స్తంభాలంకృతమై శిల్పకళచే రాజిల్లుచున్నది. ఈ యావరణము దాటఁగనే అంతఃప్రాకారము గానిపించును. దీని మధ్యభాగమున ప్రసిద్ధిఁగన్న విరూపాక్షాలయ మున్నది. ఈ ప్రధానాలయము చుట్టును విశాల మంటపశ్రేణులును, పెక్కు చిన్నని దేవాలయములును గలవు. ఈ ప్రాకారమునకు ఉత్తరభాగమున మరియొక ద్వారము కలదు. ఇది పూర్వద్వారమంత ఉన్నతమైనదికాదు. దీనికి 'రాయల గోపుర' మనియు, 'కణ్ణగిరి గోపుర' మనియు పేళ్లు గలవు. శ్రీకృష్ణదేవరాయలు కట్టించుటవలన 'రాయల గోపుర' మనియు, నైజాము రాష్ట్రమునందుండిన కణ్ణగిరినాయకుఁడు దీనిని పునరుద్ధరించుటవలన 'కణ్ణగిరి గోపుర'మనియు పిలువఁబడుచున్నది.

అంతఃప్రాకారమునందలి యాలయములలో విరూపాక్షాలయము ప్రధానమైనది. ఇది పురాతన యాలయము. పంపా విరూపాక్షు లిందలి ప్రధాన దైవతములు. 'పం' అను శబ్దమునకు మోక్షమనియు, 'ప' కారమునకు దీనులనియు, 'ఆ' కారమునకు సువర్ణమనియు నర్థము. ముక్తి ప్రదురాలు- దీనులఁ గాపాడునది- సంపత్ప్ర

దురాలు– అని యీశబ్దభావము. కావున పార్వతికి 'పంప' యనియు, ఆమె పతియైన విరూపాక్షునకు 'పంపాపతి' యనియు పేర్లు గలిగెను.

విరూపాక్షాలయము చాళుక్యకాలపు కట్టడముల పద్ధతి ననుసరించి కట్టఁబడియున్నది. ఈ యాలయమునకు ఉత్తరభాగమునఁ గల శిలాశాసనమువలన నాగవంశజుఁడగు కలిదేవరసు బళ్లారిరాష్ట్రములోని కురుగోడుమండలమును పాలించుచున్నతరి ఒక భక్తుఁడు విరూపాక్షుని పేర కొన్ని మాన్యక్షేత్రము లుంచినట్లు తెలియుచున్నది. ఈ యాలయమునందలి కొంతభాగమును విజయనగరరాజులలో మొదటివాఁడగు హరిహరుఁడు మాధవ విద్యారణ్యుని జ్ఞాపకార్థము కట్టించెను. దేవునికి నైరృతిభాగమునందు దీపస్తంభమును మీనమామాత్యుని పౌత్రుఁడైన ఐతనుఁడు నిలిపెనని యొక శాసనమువలన తెలియుచున్నది. ఈ యాలయమునకు పూర్వోత్తర దిశలయందు రెండు ద్వారములు గలవు. పూర్వద్వారము ప్రధానద్వారము. దీనికి ముందుభాగమున నొక విశాలమైన మంటపమున్నది. ఇది 'కల్యాణమంటప'మనియు, 'రంగమంటప' మనియు పిలువఁబడుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు ఈ మంటపమును క్రీ. శ. 1509 – వ వత్సరమున తన పట్టాభిషేకోత్సవ జ్ఞాపకార్థముగ నిర్మించెను. రంగమంటపమునందలి చిత్రలేఖనా నైపుణ్యమును, శిల్పచాతుర్యమును వర్ణనాతీతములు. గర్భాలయమునఁగల శివలింగమునకు శ్రీ విరూపాక్షుఁడనియు, పంపాపతియనియు పేళ్ళుగలవు. లోపలిభాగమున పదునొకండు దివ్యజ్యోతులును, ఇరువదియేడు అఖండ దీపారాధనలును సర్వదా వెలుగుచుండును. లింగమునకు వెండికవచమును, ముఖతలాటమును పెట్టియుందురు. దీనికి పార్శ్వభాగమున శ్రీ చక్రము కలదు. ఇదియే– ఈ క్షేత్రమున ప్రధాన దైవతము.

భువనేశ్వరీ దేవ్యాలయము :

ఈమె మహాశక్తి స్వరూపిణి. బ్రహ్మవిద్యానుసంధాయిని. ఈమెను సేవించువారికి అమానుషశక్తి లభించును. ఈమె యనుగ్రహము వలననే విద్యారణుఁడు సువర్ణవృష్టి గురియించెను.

ఈ యాలయము విరూపాక్షేశ్వరుని గర్భగృహమునకు సమ రేఖయం దుండక, ఒక మూలలో నుండుటవలన పూర్వము శిథిలావస్థలో నుండిన మొదటి యాలయమే కాలాంతరమున పునరుద్ధరింపబడి, యిప్పుడు మనకు గనబడు విరూపాక్షాలయమని తోచుచున్నది. బలాఢ్యమైన ద్వారము ఈ యాలయమునకు గలదు. ఇంచలి స్తంభములును, ద్వారమును నల్లరాలతో జేయబడి, అబ్బురము గొల్పు పనితనముతో విరాజిల్లుచున్నవి. ఇవి – చాళుక్యుల కాలమునాడు తీర్చిదిద్దినవి. వీనిని వర్ణించుశక్తి కవిలేఖినికి జాలదు. గర్భాలయము నకు పై భాగమున నవగ్రహమండలము నొకరాతిపై చెక్కబడి యున్నది.

గుంజా మాధవస్వామి :

ఈ యాలయము భువనేశ్వరీ దేవ్యాలయమునకు క్రిందిభాగమున, భూగర్భమున నున్నది. దిగుటకు చక్కని సోపానములు కలవు. శ్రీమహావిష్ణువు ఈ క్షేత్రమునకువచ్చి, ఉత్తరకాశియని ప్రసిద్ధి చెందిన శ్రీ విశ్వనాథ క్షేత్రమునకును, దక్షిణకాశియని పేరుగన్న యీ విరూపాక్ష క్షేత్రమునకును తారతమ్యము కనిపెట్టబూని, రెండు క్షేత్రముల ప్రభావమును త్రాసునందుంచి తూచుచున్నాడు. అందు ఉత్తరకాశి ప్రభావము దీనికంటె ఒక గుంజామాత్రము (గుంజా=గురిగింజ) తగ్గినను ఈ క్షేత్రమే విశిష్టతరమని దృష్టపఱచుటకోయన ఒక గురిగింజను చేతధరించియున్నాడు. దాన, ఈతనికి 'గుంజా మాధవస్వామి' యని వ్యవహారనామ మేర్పడెను.

విద్యారణ్యుని గుడి :

విరూపాక్షాలయమునకు వెనుకభాగమున, కొంతదూరమున ఈ గుడియు, దాని పార్శ్వతలమున శ్రీ విరూపాక్షస్వాములవారి మఠమును గలవు. ఆలయమునకు పశ్చిమభాగమున లోకపావన పుష్కరిణి కలదు. దీనికి రుద్రపుష్కరిణి యనియు నామాంతరము. లోకమును రక్షించువారు 'లోకిపు' లనబడుదురు; అట్టివారిని 'అవనము' చేయునది కావున లోకపావన మను పేరు గలిగెను. ఇది – ఉత్తరకాశి

లోని 'మణికర్ణిక'తో సమానమైనది. ఈ సరోవరతీరముననే శృంగేరి భట్ట గుహ కలదు. అందు – ఆపేరి విగ్రహమున్నది.

అంతఃప్రాకారమునందలి ఉత్తరద్వారమునుండి తుంగభద్రా నదికి పోవుదారి కలదు. ద్వారము చెంతనే, కుడివైపున, ఒక విశాల మైన కోనేరు కలదు, దీనికి 'మన్మథతీర్థ' మనియు, 'బ్రహ్మపుష్క రిణి' యనియు పేర్లు. ఈశ్వరుడు కాముని దహించినపుడు ఫాల నేత్రాగ్నియొక్క వేడిమిచే మొగమున చెమ్మట గ్రమ్మెను. ఆ స్వేదజలమే – ఈతీర్థమగుటవలన 'మన్మథతీర్థ' మనియు, బ్రహ్మ కల్పాదియందు ప్రపంచ సృష్టికివలయు జ్ఞానశక్తికై ఈ తీర్థమున స్నానమాచరించి సర్వజ్ఞుఁడగుటవలన 'బ్రహ్మపుష్కరిణి' యనియు పిలువఁబడుచున్నది.

ఈ సరోవరమునకు కొన్ని గజముల దూరమున తుంగభద్రా నది కానిపించును. ఇచ్చటి నదీ భాగమునకు 'వాసిష్ఠతీర్థ' మని పేరు. పూర్వము ఇచ్చట వసిష్ఠుఁడు తపమాచరించి, ముక్తి పొందుటవలన ఈ పేరు గలిగెను. శ్రీ మహావిష్ణువు వరహావతారమున హిరణ్యాక్షుని వధించినపుడు వరాహ పర్వతమున పడిన రెండు స్వేదబిందువులే 'తుంగ' 'భద్ర'గఁ బుట్టి, కొంతదూరము ప్రవహించి, రెండును కలియుటవలన 'తుంగభద్రా'నది యయ్యెనని ఐతిహ్యము కలదు.

పంపాపుర వీధి :

అది – విరూపాక్షాలయ పూర్వద్వారమునకు ఎదురుగనున్నది. ముప్పదియైదు గజముల వెడల్పును, ఎనిమిదివందల గజముల పొడ వును గలిగి, చూచుటకు అందముగా నుండును. ఇందే – రథోత్స వాదులు జరుగును. దీని కిరువైపుల శిథిలమంటపములును, గృహము లును శ్రేణులుదీరియున్నవి. అందు – కొన్ని రెండు మూఁడు అంత స్తులు కలవి. చైత్రశుద్ధ పూర్ణిమాదివసమున జరుగు బ్రహ్మరథోత్సవ కాలమున యాత్రికులు వేనవేలు ఈ మండపముల విడియుదురు. పూర్వము, ఈ వీధియందు ఉన్నతాధికారులకును, రాజునకును గృహా వసతు లుండినట్లు 'పెయిస్' తెల్పియున్నాఁడు. ఇందు – రెండు

కొయ్యతేరులు గలవు. ఒకటి - విరూపాక్షేశ్వరునిది; రెండవది - శ్రీవిద్యాశంకర చంద్రమౌళీశ్వరస్వరూప విద్యారణ్య శిష్యపరంపరా ప్రాప్త శ్రీ శ్రీ జగద్గురుస్వాములవారిది. రథోత్సవకాలమున ఇవి రెండును ఉపయోగింపఁబడును. ఈ మహోత్సవమును కన్నులారఁ గాంచి, ఆనందింప, జనులు వివిధ రాష్ట్రములనుండి తండోపతండము లుగా వత్తురు.

నంది విగ్రహము :

పంపాపుర వీథికి చివరభాగమున ఒక శిథిలమంటపము కలదు. అందు - ఏకశిలా నిర్మితమై, శిల్పకళారహితమైన నంది విగ్రహము కలదు. పశ్చిమాభిముఖము.

ఈ మార్గమునఁ జూడఁదగిన శిథిలము లివి.

## ౫

# తలారిగట్టు మార్గము

[పంపాపురవీథి చివరిభాగము – తుంగభద్రానదీతీరము]

**కోదండరామస్వామి ఆలయము :**

పంపాపురవీథిచివరనుండి ఈశాన్యభాగమున, కొంతదూరము పోఁగా గండశిలల మధ్యభాగమున, నదీతీరమున, మెలికలు తిరిగిన శిలాసోపానమార్గము కలదు. ఆ త్రోవ ననుసరించి కొన్ని గజముల దూరము నడిచినచో ఒక దేవాలయ మగపడును. అదియే – కోదండరామస్వామి దేవాలయము. అది – ఉత్తరాభిముఖము. ఆలయ మంత పెద్దదికాదు. వెనుకభాగమున ఎత్తైన కొండగలదు. ముందు భాగమున మెలితిరిగి ప్రవహించెడి తుంగభద్రానది కలదు. దాని కావల, దరిని ఆనుకొని, గండశిలావృతమై, భీతావహమగు ఋశ్యమూకాద్రి కలదు. గర్భాలయమున రామలక్ష్మణులు ధనుర్ధారులై, సీతాదేవితో నిలుచుండినట్లు ఏకశిలా నిర్మితములైన భవ్యవిగ్రహము లున్నవి. వానికి పార్శ్వభాగమున దాసాంజనేయ విగ్రహమున్నది. ఈ ప్రతిమల యందమును, శిల్పిచాతుర్యమును వర్ణనాతీతములు. ఎంతటి కఠినహృదయునికైనను, నాస్తికునికైనను ఈ మంజుల విగ్రహములను చూడఁగనే భక్తిభావ ముదయించును. దీని ముందటి భాగమున నాఁడు – విద్యారణ్యుని ఆశ్రమ ముండెనని ప్రతీతి. 'స్వర్ణ వృష్టి కురిసిన దిచటనే. ఆనెగొందిరాజులలో నొక్కఁడగు చిన్న వేంకటపతిరాజు దీనికి గోపుర ప్రాకారాదులు కట్టించెనని నరపతి విజయము'♦ తెలుపుచున్నది. ఆలయమునకు ఎడమవైపునఁగల మండ

♦ నరపతి విజయము, ప. ౨౭౭-౨౭౯.

పమున అర్చకులు వసించుచుందురు. కోదండరాముఁడు, శ్రీ విరూపాక్షేశ్వరునకు అనుదాత యనుభావమున ప్రతివత్సరమునను మార్గశీర్ష బహుళ విదియ దివసమున 'ఫలపూజ' కన్యావరుల నిశ్చితార్థము జరుగును.

కోదండరాముని యాలయమునకు వెనుకభాగమునఁగల పర్వతమున రెండు, మూఁడు ఆలయములు గలవు. అందు, ప్రసిద్ధిగన్నది యంత్రోద్ధారక ఆంజనేయస్వామి యాలయము. యంత్రమధ్యమున ఆంజనేయ విగ్రహము చెక్కఁబడి యున్నది దీనిని వ్యాసరాయలు ప్రతిష్ఠించిరి. ఇది – మాధ్వబ్రాహ్మణులకు ప్రధానస్థానము.

చక్రతీర్థము :

కోదండ రామాలయమునకు ఎదుట ప్రవహించు తుంగభద్రా భాగమునకే చక్రతీర్థ మనిపేరు. ఇచ్చట, నది మలుపుతిరిగి, ఋశ్యమూక పర్వతశ్రేణులను తొలుచుకొని, గంభీరస్వనమున ప్రవహించుచుండును. ఈ ప్రదేశమున నీరు చక్రాకారముగఁ దిరుగుచు ప్రవహించుటవలన దీనికి 'చక్రతీర్థ' మని పేరుగలిగెను. ఇచ్చట శ్రద్ధతో పిండప్రదానము గావించిన తమ పితరులకు అక్షయ పుణ్యలోకములు గలుగునని పెద్దల నమ్మకము. మొసళులు ఈ ప్రదేశమున అప్పుడప్పుడు గానిపించును.

కోదండరామాలయమునకు క్రిందిభాగమున చక్రతీర్థమున కించుక దూరమున విశాల శిలాతలమున వేనవేలు లింగములు గానిపించును. ఆ భాగమునకు 'కోటిలింగ తీర్థ' మని పేరు.

వరాహ దేవాలయము :

కోదండరామాలయమునుండి ఈశాన్యభాగమున కొన్ని గజముల దూరము నడచినచో త్రోవ కెడమవైపున ఈ శిథిలాలయము కానిపించును. దీని ముందటి భాగమున అసమగ్ర సింహద్వారము కలదు. ద్వారము లోపలి గోడల శిలలపై వరాహరూపమును, దానికి ముందువైపున నొక ఖడ్గమును, దానికి ఈవల నావల సూర్యచంద్ర ప్రతిమలును చెక్కఁబడి యున్నవి. విజయనగరరాజులు ఈ చిహ్న

ములను తలచుగ తమ కట్టడములపై చెక్కించుచుండిరి. ఈ యాల యమున చూడఁదగిన విశేషములు లేవు.

'సూళెయ' బజారు :

వరాహ దేవాలయమునకు దక్షిణ భాగమున శిలామంటప శ్రేణులతో తీర్చఁబడిన పొడవైన వీధి కలదు. దీనికి 'వెలయాంధ్ర వీధి' యని పేరు. కన్నడ భాషయందు 'సూళెయ' బజా రందురు. ఇది- ఇప్పుడు శిలరూపమున నున్నది. దీని చివరభాగమున అచ్యుత రాయాలయము కలదు. ఈ ప్రదేశమునకు ఆకాలమున 'అచ్యుత రాయలపేట' యని పేరు. వీధికి ఇరువైపుల వెలయు పర్వత శ్రేణుల యడుగు భాగమున శిలరూపముననున్న గృహకుడ్యము లనేకములు గానిపించును. వీధికి వాయవ్య దిశయందొక సరోవరము కలదు. దీని మధ్యభాగమున శిలమైన మంటప మున్నది. ఈ కొలను వారాంగనల స్నానార్థమో, బాటసారులకొరకో నిర్మితమై యుండును. ప్రకృతము ఈ ప్రదేశమంతయు సాగుచేయఁబడుచున్నది.

అచ్యుతరాయల దేవాలయము :

ఇది- సూళెయ బజారునకు చివరనున్న విశాలమైన దేవాలయము. దీనికిని విరూపాక్షాలయమునకువలె రెండు ప్రాకారము లున్నవి. ప్రాకార కుడ్యము లున్నతములై, గోపురాలంకృతములై వెలయుచున్నవి. ప్రాకారము లోపలిభాగమున ఇరుప్రక్కల శిలమైన మంటపశ్రేణులు కలవు. ఆలయము ఉత్తరాభిముఖము. దీనిని క్రీ. శ. 1539 వ వత్సరమున అచ్యుతదేవరాయలు కట్టించెనని ప్రధాన ద్వారమందలి గోడయందున్న శిలపై చెక్కఁబడి యున్నది. కట్టడపురీతి విఠ్ఠలాలయమును పోలియున్నను ఆ యాలయపు చక్కఁదనము, శిల్పముల సొగసు దీనియం దగపడవు. స్తంభములు చిత్రాలంకృతములు. ముఖమంటపమునకు పశ్చిమ, వాయవ్య భాగములం దగపడు శిల్పమును, పశ్చిమద్వారమున గజావృషభ సమ్మేళనమును, అంతః ప్రాకారమున ఉత్తరద్వారమునందలి పనితనమును వర్ణనాతీతములు. ఇందు- అచ్చటచ్చట విష్ణులీలలు చిత్రితములై యున్నవి. ఆలయ

ద్వారమున లో వెలుపలభాగములందు నదీ దేవతా విగ్రహములు రెండు మకరముపై గంగయు, కూర్మముపై యమునయు పయన మొనర్చుచున్నట్లు అతి విన్నాణముగ చెక్కఁబడియున్నవి. ఇట్టి శిల్పములు ఉత్తర హిందూస్థానమున ఎనిమిదవ శతాబ్దపు దేవాలయములందు తరచుగఁ గనిపించును బహిరావరణమునకు వాయవ్య భాగమున విశాలమైన కళ్యాణమంటప మున్నది.

మాతంగపర్వతము :

అచ్యుతరాయాలయమునకు దక్షిణ భాగమున ఒక చిన్నని ద్వారముకలదు. దానిని దాటఁగనే నీటికాలువ అగపడును. ఆకాలువ ననుసరించి పశ్చిమాభిముఖముగా కొన్నిగజముల దూరము నడువఁగనే మాతంగపర్వతోపరిభాగమునకు పోవుటకు అనువుగ నిర్మింపఁబడిన రాతిమెట్లవరుస యగపడును. ఆ శిలా సోపానముల ననుసరించి పర్వతాగ్రము చేరఁగనే ఒక దేవాలయము కనుపించును. అందు - కృష్ణశిలా నిర్మితమైన పరశురాముని విగ్రహ మున్నది. ప్రాకారద్వారము దక్షిణాభిముఖము. విగ్రహమునకు దగ్గర అమ్మవారి ప్రతిమయు, మూఁడుశిలానిర్మితములైన నందులునుగలవు. ఆలయము రాలతోడను, ఇటుకలతోడను, సున్నముతోడను కట్టఁబడి చిన్నని గోపురాలంకృతమైయున్నది. దీనిని ఆనుకొని కొన్ని మంటపములును, చిన్నని ఆలయములును కలవు. కాని, ఇప్పుడివి విగ్రహ శూన్యములు. ఇందలి స్తంభముల శిల్పముఁజూడ నిది పదునాల్గవ శతాబ్దియందు కట్టఁబడినట్లు తోఁచుచున్నది. ప్రధానద్వారము ప్రసిద్ధమైన శిల్పకళచే విరాజిల్లుచున్నది. కాని, సున్నపుపూఁతలవలన శిల్ప మిప్పుడు స్పష్టముగాఁ గానిపించుటలేదు. ఒకవైపున బౌద్ధ సాంప్రదాయానుసారముగ పొట్టి బొతులవరుస చెక్కఁబడియున్నది. ఇంతటి యెత్తైనకొండ యీ చుట్టుఁ బట్టులఁ గానరాదు. ఈ పర్వతగర్భమున నేఁటికిని అనేక ఋష్యాశ్రమము లున్నవి. మన కిందు కనఁబడెడి గుహాద్వారములే అందులకు ప్రబల సాక్ష్యములు. ఇందలి యొక గుహలో కుమారస్వామి విగ్రహము కలదు. ఈ పర్వతమునందే తొల్లి, మతంగుని ఆశ్రమము

వెలయుచుండెడిది. మతంగముని యిచ్చట తపమాచరించి, పరాశక్తిని తన తనయగాఁ బడసెను. శిష్యురాలు 'శబరి' యను బోయత.

ఈ కొండ పైభాగము నేత్రానందము గూర్చును. యాత్రికుఁడు యీ శైలశిఖరము నెక్కి, చుట్టునుగల దృశ్యములను చూచినచో—అతని జన్మము సఫలత నొందగలదు. ఆహా! ఏమి యీ ప్రకృతిశోభ! ఒకవైపున గండశిలలు నోలుచుకొని, తపసమండపముల మఱుఁగున, తొంటి విజయనగర ప్రాభవముచాటు తరంగనిస్వనముల, వెండిరేకులు పఱచినట్లు ప్రవహించు తుంగభద్రా సవంతీ గంభీరాకృతి గోచరించును. వేరొకవైపున మాల్యవంత రఘునాథాలయ ప్రాకార గోపురాదులు దృష్టిపథమునఁ బడును. మఱియొకవైపున నాఁటి యంతఃపురావరణ భవనాదికములు వింతగొల్పుచుండును. ఇంకొకవైపున హేమకూట పర్వతాగ్రములును, విరూపాక్షాలయ గోపురాదులును ఆనందదాయకములై అగపడును.

అనంతశయనాలయము :

యాత్రికుఁడు మాతంగపర్వతము దిగి, సూళెయబజారునకు ఉత్తరపుకోనయందలి కాలిబాట ననుసరించవలెను. ఈ వీథికి ఉత్తర భాగపు చివరకు తూర్పుదిశయందొక ఆలయ మగుపడును. అదియే అనంతశయనాలయము. దీనికిని, వరాహదేవాలయమునకును నడుమ ఇరువదిగజముల దూరముండును. ఇది కమలాపుర మార్గమునందలి అనంతశయనాలయముకంటె చాల చిన్నది. ఆలయప్రదేశమున స్వాభావసిద్ధముగ యేర్పడిన రాతిపై శిల్పి అనంతశయనుని దివ్య విగ్రహమును మలఁచెను. ఇది యిప్పటికిని ఖిలముకాక, చూచుట కందముగా నున్నది.

జైనాలయము :

అనంతశయనాలయమునుండి కొన్ని గజములదూరము నదీముఖముగా నడచినచో ఉన్నత శిలాతలమున ఒక యాలయ మగపడును. ఇది ఆకృతిని జైనాలయమును పోలియున్నది. పైకిపోవుటకు సోపానములు కలవు. ఆలయము పూర్వాభిముఖము. పైభాగమున

గోపురమును, ముందటిభాగమున మండపమును. చుట్టును ప్రాకారమును కలవు. వెలుపలిభాగమున ఉన్నతమైన ధ్వజము కలదు. ఆలయము విగ్రహశూన్యము. గోడలపై విష్ణులీలల చిత్రములును, ద్వారపార్శ్వశాలములందు నైన తేయు, అంజనేయుల విగ్రహములును; ఉత్తర దక్షిణద్వారముల జయవిజయుల ప్రతిమలును చెక్కబడియున్నవి. ప్రక్కగోడలపై గజచిత్రములు కలవు. ఇందలి ప్రతిమలనుబట్టి యిది వైష్ణవాలయమని వూహింపవలసియున్నది. కాని, జైనాలయముల గోడలపై చెలిచుగ వృషభము, గజము, మర్కటము, మకరము, సింహము మొదలగు జంతువుల ఆకృతులను చెక్కుట ఆచారము. ఇందలి గోడపై గల గజచిహ్నమునుబట్టి యిది జైనాలయమని యూహించుటకు తగిన అవకాశ మున్నది. ఆలయ ప్రాకారమునకు లోపలిభాగమున, దక్షిణపార్శ్వమున, రెండంతస్తుల మండపమున్నది. ఇందు వ్యాసరాయలు తన శిష్యులకు వేదాంతశాస్త్రప్రవచనము కావించుచుండిరని తెలియుచున్నది.

సుగ్రీవుని గుహ :

జైనాలయమునకు ఉత్తరమున, మార్గమున కభిముఖమై, ఎఱ్ఱమంటిచారలును, సున్నపుపట్టెలును గల గండశిలలు కొన్ని అగపడును. ఆ శిలల లోపలిభాగమున యీ గుహ కలదు. లంకాధిపతి సీతను గొనిపోవునపుడు ఆమె తన సొమ్ములను దీసి, చీరచెఱఁగునఁగట్టి యీ గుహాప్రాంతమునఁ బడవైచెను. గుహకు చెంగటనున్న ఋశ్యమూకాద్రి నివసించు సుగ్రీవుడు ఆ మూటను యీ గుహయందు శ్రీరాముఁ డేతెంచువరకును దాఁచియుంచెను. కావున, ఈ గుహకు 'సుగ్రీవునిగుహ' అని పేరుగలిగెను. దీని యంతర్భాగమున సీత చరణములని చెప్పబడు పాదములు రెండు ఒక రాతిపైఁ జెక్కఁబడియున్నవి. యాత్రికులు వీనిని పూజింతురు. గుహ యిఱుకై, చాల చిన్నదిగా నుండును.

గుహాముఖమునుండి జైనాలయము దిశకు కొన్ని గజముల దూరము రాతిపై నొక చాఱ యగపడును. సీత, తన పైటచెఱఁగునఁ

గట్టి పడవైచిన సొమ్ములమూటను కపియొక్కటి నోటఁగఱచి, బండపై నీడ్చుకొని గుహలోనికిఁబోవ నేర్పడిన చాఱ యందురు. కావున, నిది 'సీత చెఱఁగు' అని పిలువఁబడుచున్నది.

సీతాసరోవరము :

సుగ్రీవుని గుహకు కుడివైపున నొక సరోవరము కలదు. దీనిని 'సీతాసరోవర' మందురు. వాల్మీకి సీతను తోడ్కొని యీ క్షేత్రము నకు వచ్చి, 'ఈ సరోవరమున స్నానమొనర్చి గౌరీపూజ యొనర్పు' మని చెప్పగా, సీత అట్లాచరించి, గౌరీదేవి కృపఁ బడసెను. అప వాదము నశించెను. వీరాగ్రేసరులగు పుత్త్రులను పడసెను. భర్తృప్రీతికి పాత్రురాలాయెను. ఈ సరోవరమున అఘమర్షణసూక్తము జపించి, స్నాన మాచరించినవారికి సర్వపాపములు నశించును.

సుగ్రీవునిగుహకు ఎడమవైపున, నదీతీరమున, గండశిలల మధ్య భాగమున, సుమారొక ఫర్లాంగుదూరమున, ఉత్తరాది మఠాధిపతు లగు రఘునందన తీర్థుల బృందావనము గలదు. మాధ్వబ్రాహ్మ ణుల కిది ముఖ్యప్రదేశము. ఇచ్చట ప్రకృతిశోభ మిగుల రామణీయ కముగా నుండును. నది, పరిపూర్ణ ప్రవాహమున నున్నప్పుడు అచ టికిఁ బోవుటకు వీలుకాదు.

శిథిలమైన వంతెన :

సుగ్రీవుని గుహకును, సీతాసరోవరమునకును, వెనుకభాగ మున, నది కడ్డముగా, శిలానిర్మితమైన వంతెన గుఱుతు లగపడును. ఇది – ఇప్పుడు సంపూర్ణముగ శిథిలమై యున్నది. అచ్చటచ్చట, తాళవృక్షముల పగిది నిలువురాలు మాత్రము నేఁటికిని కానవచ్చు చున్నవి. ఆర్వీటివంశజుఁడైన అళియ రామరాజు దీనిని క్రీ. శ. 1541–1565 మధ్యకాలమున కట్టించినట్లు తెలియుచున్నది.

రామలక్ష్మణుల పాదములు :

సీతాసరోవరముదాఁటి కొలఁది దూరము నడచిన పిదప, త్రోవకు ఎడమవైపున, కోటగోడ క్రిందిభాగమున, తుంగభద్రానది

గట్టున, ఒకటిన్నర యడుగుల యెత్తుగల ఒక చిన్నని రాతిగోడ యగపడును. దాని లోపలిభాగమున నొకవైపున రామలక్ష్మణుల పాదములని చెప్పఁబడు రెండుపాద చిహ్నములు గలవు. ఇవి - సాధారణ పాదములవలెఁగాక, వ్యత్యస్తముగ నున్నవి. వీనిచుట్టును సర్పము చెక్కఁబడి యున్నది. ఈ సర్పమునకు చుట్టును నలువైపుల ఒక చిన్నని శిలావేదిక కలదు. దానిపై-పూర్వభాగమున సూర్యుని, పశ్చిమమున చంద్రుని, ఉత్తరమున శంఖు చక్రములను, దక్షిణమున త్రిశూలమును చెక్కఁబడియున్నవి. ఈపాదములను ఆనుకొని నీటి మడుఁగు కలదు. పాదములకును, మడుగునకును పైభాగమున పెద్ద సర్పము చెక్కబడియున్నది. దానిఫణకు సమీపమున శివలింగమును, దానిని ఆనుకొని నందియు చెక్కఁబడియున్నవి.

రాజతులాభారము :

రామలక్ష్మల పాదములకు కొంతదూరమున త్రోవనడుమ, రెండంతస్తులుగల ద్వార మొకటి కానిపించును. దానిని దాఁటగనే 'రాజతులాభార' మగపడును. ఇది - యొక మహాద్వార బంధమును పోలియున్నది. రెండు పెద్దరాతి నిలువులపై భారమైన అడ్డశిలచే నిది నిర్మింపఁబడియున్నది. రాతి నిలువుల మధ్యభాగమున పది పండ్రెండు అడుగుల యంతరము గలదు. ఎత్తు రమారమి పదునైదు అడుగులు. మీఁది అడ్డశిలకు క్రిందిభాగమువ త్రాసును తగిలించుటకు మూఁడు ఉంగరములు తొలువ బడియున్నవి. వెనుకభాగమున, క్రింది వైపున, మకుటధారియు, ముకుళిత హస్తుఁడునైన రాజుయొక్కయు, ఆతని యిద్దఱు రాణులయొక్కయు ప్రతిమలు చెక్కఁబడియున్నవి. ఇవి - కృష్ణదేవరాయలయొక్కయు, ఆతని రాణులయొక్కయు ప్రతిమలై యుండనోపును.

విజయనగరరాజులు పట్టబంధోత్సవము లందును, ప్రధాన పర్వదివసములందును దీనికి త్రాసును దగిల్చి, తా మొకవైపు కూర్చుండి, వేఱొకవైపు వజ్రవైడూర్య సువర్ణ మౌక్తికముల నుంచి తమ యెత్తుతూఁచి, బ్రాహ్మణులకు దాన మొసఁగుచుండిరి. దీనిని 'తులాపురుషదాన' మందురు.

అసమగ్ర సింహద్వారము :

ఇది - రాజతులాభారమునకు కొన్నిగజముల దూరమున, నెడమవైపునఁ ద్రోవకుగలదు. అసంపూర్ణమై, ఉత్కృష్ట శిల్పమున నొప్పుచున్నది.

ఈ ద్వారమునకు ఉత్తరభాగమున లక్ష్మీనారాయణుని గుడి కలదు. ఇది - చిన్నదైనను మిక్కిలి అందముగా నున్నది. విగ్రహ శూన్యము. పూర్వాభిముఖము. దీనిని - సదాశివరాయలు క్రీ. శ. 1561–1562 మధ్యభాగమున కట్టించెనని యిందలి శిలాశాసనమువలనఁ దెలియుచున్నది.

విఠోబాలయము :

పైని పేర్కొనిన లక్ష్మీనారాయణుని గుడికి ఇంచుక ఈశాన్య భాగమున, కొన్నిగజముల దూరమున ప్రసిద్ధిగన్న విఠోబాలయము కలదు. ఈ దేవునకు 'విట్ఠలుఁ'డనియు; 'విఠోబ'యనియు పేళ్ళు. మహారాష్ట్రులు ఈ దైవతము నెక్కువగా నారాధింతురు. ఈ యాలయము నకు లోవెలుపలి భాగములందు క్రీ. శ. 1513–1564–వ వత్సరము వఱకుఁగల శిలాశాసనములు ఇరువదిమూఁడింటికి తక్కువగాక యున్నవి. వీనిలో కొన్ని అఱిగిపోయి, స్పష్టముగఁ గానిపించుట లేదు. ఈ శాసనములలో నొకదానివలన శ్రీకృష్ణదేవరాయలు ఈ యాలయమును క్రీ. శ. 1513–వ వత్సరమునఁ గట్టుటకు ఆరంభించి దేవునకు కొన్ని మాన్యక్షేత్రము లుంచినట్లు, ఆతని భార్యలగు చిన్నాదేవీ తిరుమలదేవులు ఒక్కొక్కరు ఒక్కొక్క ద్వారమును కట్టించి, స్వర్ణకలశములఁ జేయించి, అర్పించిరనియు దెలియుచున్నది. ఆలయ నిర్మాణకార్యము శ్రీకృష్ణదేవరాయల తరువాతి ప్రభువులగు అచ్యుతరాయల-సదాశివరాయల కాలమున సహితము జరిగి, తల్లికోట యుద్ధానంతరము నిలిచిపోయెనని తెలియుచున్నది. ఆలయ నిర్మాణము పూర్తికాకపోవుటచే విగ్రహమే ప్రతిష్ఠింపబడలేదని తోఁచుచున్నది. బొంబాయిరాష్ట్రములోని షోలాపుర మండలము నందలి పండరీపురమునఁగల పాండురంగ విట్ఠలున కిది నిర్మింపబడి

నట్లును, ఆ దేవుఁ డీ యాలయమునుచూచి ఇంతటి వైభవోపేతమగు దేవళమున నివసించు సన్నాన తనకుఁ జాలదని తలఁచి, అటనుండి పూర్వస్థానమగు పండరీపురమునకు తరలిపోయినట్లును ఒక కథ చెప్పుదురు.

ఆలయమునకు చుట్టును బలమైన రాళ్ళతోఁ గట్టఁబడిన ప్రాకారము కలదు. ఉత్తర, దక్షిణ, తూర్పు భాగములయందు మూఁడు ద్వారములు కలవు అవి నేఁడు శిలమైయున్నవి. ఇందు-అమ్మవారిశాల, కళ్యాణమంటపము, చిన్నని దేవాలయములు, రాతి తేరు, చుట్టును మండపములును గలవు. గర్భాలయముయొక్కయు, మండపములయొక్కయు శిల్పపుపనినిగూర్చి యెంతపొగడినను తీరదు. గర్భగృహమునకు ముందరిభాగమునఁగల కల్యాణమంటపమునందలి శిల్పమునుగూర్చి వర్ణింప ఆ చతుర్ముఖుఁడే చాలఁడన నే నెంతటి వాఁడను ! ఈ మండపద్వారపార్శ్వములందు తొండములు తెగిన ఏనుఁగులు రెండుకలవు. మండపము లోపలిభాగమున దేవతల వివాహాది కైంకర్యములకొరకు నిర్మింపఁబడిన వేదిక కలదు. ఇంతటి అద్భుత శిల్పాలంకృతమైన మంటపము దక్షిణ హిందూస్థానమున మఱెచ్చటను గానరాదు అభేద్యములగు గండశిలలతో నిర్మింపఁబడిన ఒక్కొక్క స్తంభము పదునైదు అడుగుల నిడివి గలిగియున్నది. అందు-ఒక్కొక్క కంబమునకును నడుమ వలయాకారముగల కంబమొకటియు, దాని చుట్టును పదునాఱు చిన్నని కంబములును నిర్మింపబడి యున్నవి. ఈ కంబముల నొకరాతి ముక్కతో మెల్లగాఁ గొట్టినచో అం దొకదానికంటె మఱియొకటి నాదభేదమును గలిగియుండును. కంబములందు సింహములు, గుఱ్ఱములు మొదలగు జంతువులయొక్క ప్రతిమలు ఒంటిరాతిలోనే చెక్కఁబడియున్నవి. ఆలయకుడ్యములపై బాతులు, గుఱ్ఱములు మున్నగు చిత్రములు గలవు. పైభాగమున రామాయణ కథాబోధకములగు ప్రతిమ లున్నవి. రాతికంబముల యమరిక వర్ణనాతీతము. దీపములుంచుటకు గుడి కప్పుల చూరులనుండి రాతిగొలుసులు వ్రేలుచుండెననియు, ఆరాధకులు వానికి దీపపుకుప్పెలు తగిలించుచుండిరనియు తోఁచుచున్నది. ఇందలి చిత్రపుపని అన్నివిధముల

హజారరామాలయమును పోలియున్నది. పదునాఱవ శతాబ్దిని శిల్ప కళావిజ్ఞానమెంత ఉన్నతదశయందుండెనో తెలిసికొనుటకు ఈ యాలయ శిల్పకళా వైభవమే సాక్ష్యము. దీని శిల్పకళనుగూర్చి ఫెర్గుసన్♦ Fergusson) అనేకవిధముల కొనియాడెను.

"క్రీ. శ. 1516 వ వత్సరమున శ్రీకృష్ణదేవరాయలు ఆల యము ఆవరణమున నూఱు స్తంభముల మంటపమును నిర్మించెనని ఇందలి శిలాశాసనమువలనఁ దెలియుచున్నది. క్రీ. శ. 1532 వ వత్స రమున మూలవిగ్రహమునకు వెనుకవైపున యోగనరసింహమూర్తిని వ్యాసతీర్థులు ప్రతిష్ఠించినట్లు మఱియొక శాసనమువలనఁ దెలియు చున్నది. క్రీ.శ. 1538 వ వత్సరమున రాచనగరి యధికారియైన రఘు నాథనాయకుఁడు ఆలయమునకు ఉత్తరభాగముననుండు గోపురముపై శిఖరముల నెత్తించెనని వేఱొండు శాసనమువలన స్పష్టమగుచున్నది. క్రీ. శ. 1554 వ వత్సరమున ఉదయగిరి తిమ్మరాజు దేవుని డోల్లో త్సవమునకై గర్భగృహమున కెదుట ఒక శిలామంటపమును గట్టిం చెనని యింకొక శాసనము వ్రాయఁబడియున్నది. దేవుఁడు పరాం కుశ మంటపమునకు విచ్చేయునపుడు జరుపవలసిన ఉపచారముల కొఱకు సదాశివరాయలు క్రీ. శ. 1558 వ వత్సరమున భూదాన మొనర్చినట్లొక శాసనమున లిఖింపబడియున్నది."*

దేవాలయమునకు ముందువైపున నొక రాతితేరు గలదు. అది ఆకారమున చిన్నదైనను మిగుల నందముగా నున్నది. దానికి ఉభయ పార్శ్వములందును బలమైన రాతియేనుఁగులు రెండు కలవు. రథము ఏకశిలానిర్మితమని కొందఱి యభిప్రాయము స్త్రీలు చిలుకలపైఁ గూర్చుండి వానిని అదలించుచున్నట్లు ప్రతిమలు రథము చుట్టును చెక్కఁబడియున్నవి. దీనికి బలమైన రాతియిరుసులు రెండు కలవు. వీనికి తగిలించిన చక్రములు నునుపుపాఱ తఱిమెనఁబట్టిన కొయ్యపలక

♦ Fergusson – "Shows the extrene limit in florid magnificence to which the style advanced."

* A Guide to Hampi and Vijayanagar, P. 23–24.

లను పోలియున్నవి. ఈ చక్రములను త్రిప్పుటవలన పున్నె మబ్బునని యాత్రికుల నమ్మకము. యాత్రికులు వీనిని తఱచు త్రిప్పుటచే యిరుసులు చాలవఱకు అఱిగిపోయినవి. పైభాగమున కెక్కుటకు దీని ముందరిభాగమున రాతినిచ్చెన అమర్పఁబడియున్నది.

విఠలాలయమునకు చేరువనున్న ప్రదేశమునకు ఆ కాలమున 'విఠలాపుర' మని పేరు. ఆలయ పూర్వద్వారమునకు యెదురుగా యిరువైపుల చావడులుగల విశాలమైన వీధి కలదు. దక్షిణద్వారమునకు యెదురుగా నొక యాలయమున్నది. పేరు తెలియదు. శిలమైయున్నది. ఆలయమును ఆనుకొని, వీధికి ఉత్తరపార్శ్వమున మఱియొక విష్ణ్వాలయము కలదు. విగ్రహశూన్యము. శిల్పకళచే విరాజిల్లుచున్నది. దీనిని ఆనుకొని ముండ్లపొదలలో నొక శివాలయము కలదు. వీధి ననుసరించి పూర్వదిక్కునకు కొన్ని గజములదూరము నడువఁగనే యెడమవైపున నొక కోనేరును, దాని మధ్యభాగమున ఒక శిథిలమంటపమును కానిపించును. నాగదాళిలోపూడియున్న యిది యీలోపల వెలికిఁ దీయఁబడెను. ఇఁక కొన్ని గజములదూరము పోయిన కుడిచేతివైపున ఒక దేవాలయము అగపడును. ఇది వైష్ణవాలయము. విగ్రహశూన్యము. దీనిని 'కుదిరె'గుడి యని పిలుతురు. దీని ముందుభాగమునఁగల రెండు కంబములపై అశ్వాకృతులు చక్కఁగఁ జిత్రింపఁబడినకారణమున దీనికి యీపేరు గలిగియుండవచ్చును. ఈ ప్రధానవీధికి ఇరువైపులఁగల ఉత్తుంగ శిఖరాలంకృతములగు శైలములును, నానావిధతరుషండములును, పక్షుల భయంకరారావములును, పథికులకు భయముగొల్పుచుండును. ఇంకను కొన్ని గజములదూరము నడువ, యెడమవైపున నొక మండపమును, దాని చేరువ కమలాపురమునుండి ఆనెగొందికిఁబోయెడు మార్గమును కానిపించును. ఇది ఆమార్గమున లీనమై, ఉత్తరదిశగాఁ దిరిగి, తలారిగట్టు చేరును.

ఇచ్చటి తుంగభద్రాతీరస్థప్రదేశమునకు 'తలారిగట్టు' అని పేరు. ఆకాలమున యిచ్చట, తలవరులు వసించుటఁబట్టి యీపేరు

గలిగియుండవచ్చును. నేటికిని యిచ్చట అనేక గృహచిహ్నములు అగపడుచున్నవి. నదీతీరమున నొక శివాలయమును, మంటపమును గలవు. బాటసారులు యిచ్చటఁ గొంతసేపు విశ్రాంతిఁ గైకొందురు.

వా లి చి తి :

పై మంటపమునకు సమీపమున నొక విశాలమైన వటవృక్షము గలదు. చెట్టును ఆనుకొని కాలిబాట యగపడును. దాని ననుసరించి నదీతీరమున, దాదాపు రెండుమైళ్ళదూరము పోయినచో, తాళ వృక్షములచే చుట్టబడిన యొక దిబ్బ యగపడును. చుట్టును వరిమళ్లు కలవు. ఇది అంత విశాలమైనదికాదు. దీనిని త్రవ్వినచో, కాలిన యెముకలనుపోలిన తేలికైన ముద్దలు వెలువడును. ఇదియే వాలి దహనస్థలము. దీనికి 'వాలికాష్ఠ' మనియు, 'వాలి చితి' యనియు పేళ్లు. ఈ ప్రాంతప్రదేశ మంతయు నాఁడు 'నింబాపుర' మని పిలువఁ బడుచుండెను.

ఈ మార్గమునఁ జూడఁదగిన శిథిలము లివి.

౬

# ఆనెగొందిమార్గము

[ తలారిగట్టు - పంపాసరోవరము - నవబృందావనములు ]

ఈ మార్గమునందలి అవశిష్టము లన్నియు నైజామురాష్ట్రము లోని ఆనెగొందిసంస్థానమునకుఁ జేరినవి.

తలారిగట్టునందలి నదీతీరమున వెదురు దబ్బలతో అల్లఁబడి, అడుగుభాగమున చర్మముతో పొదుగఁబడిన గుండ్రని విశాలము లైన గంప లుండును. వీనిని అచట 'అరిగోల' లందురు. ఒక్కొక్క దానిలో దశమందిని పదునైదుమందిని కూర్చుండఁజేసి, తెడ్లు వేయుచు, అవలిదరికిఁ జేర్తురు. నదిని దాఁటుటకు సుంక మీయవలెను. ప్రాచీనకాలమునుండియు ఇట్టి గంపలలోనే జనులు నదిని దాఁటి ఆనెగొందికి పోవుచుండిరని విదేశయాత్రికులు వ్రాసియున్నారు. ఈ భాగమున నది మిక్కిలి లోఁతుగలిగి, నిశ్చలముగా నుండును. నదిని దాటఁగనే విశాల శిలానిర్మితములైన కోటగోడలును, కొత్తళములును, మహాద్వారమును కానిపించును. ఇవియే ఆనెగొందిని చుట్టియుండు కోటగోడలు. వీనిని ఒరయుచు తుంగభద్రానది ప్రవహించుచుండును. ప్రసిద్ధిగాంచు విజయనగర పట్టణమునకుఁగల నాలుగు మహాద్వారములలో ఇది పురాతనమైనది. రెండంతస్తులుగలిగి చాలభాగము శిథిలమై యున్నది. ద్వారము దాఁటినంతనే పర్వతమాలికలును, వివిధములగు తరువులును, శిథిలములయిన చిన్నచిన్న దేవాలయములును కానవచ్చును. ఇచ్చటికి ఆనెగొంది నాలుగుఫర్లాంగుల దూరమునఁగలదు. ద్వారమునుండి కొంచె

గజములు నడువఁగనే త్రోవకు కుడిప్రక్కన కొంత భాగమున పురాతన శిల్పము గలిగి శిలరూపమున నున్న భవన మున్నది. దీనిని 'హుచ్చప్పయ్యమఠ' మందురు. దీనిచుట్టును ముండ్లపొదలు బలిసి యున్నవి. ఇది దాఁటి యొకఫర్లాంగు నడచినమీఁదట దారి యించుక మలుపు తిరిగి ఆనెగొందిని ప్రవేశించును.

ఆ నె గొం ది :

ఇది- నేఁడొక చిన్నగ్రామము; నాఁడిది మహాసామ్రాజ్యమునకు మూలకందము. ప్రాచీనకాలమునుండియు రాజ్యాశ్రయ స్థానమై వెలయుచుండెనని 'ఫెరిస్తా' తెలుపుచున్నాఁడు. రాయల వంశమువారిచ్చట ఏడువందల సంవత్సరములు రాజ్యము చేసిరని 'రాయవంశావళి' యను గ్రంథము తెలుపుచున్నది. రామాయణ కాలమున ప్రసిద్ధిగన్న కిష్కింధానగరమిది. ప్రస్తుతము ఆనెగొందిక చుట్టుఁబట్టులనున్న ప్రదేశములన్నియు రామాయణమున కిష్కింధా పరిసర ప్రాంతములఁ జెప్పఁబడిన స్థానములకు సరిపోలుచున్నవి. అట్టివానిలో పంపాసరోవర మొకటి. ఇది- ఆనెగొందికి ఒకటిన్నర మైళ్ల దూరమున తుంగభద్రాతీరమునఁ గలదు. ఋష్యమూకాద్రి తుంగభద్రకు ఉత్తరపుటొడ్డున, పంపాసరోవరమునకు సమీపమున నున్నది. ఈ పర్వతశ్రేణియందే సుగ్రీవుఁడు సీత సొమ్ములను దాఁచిన గుహ వెలయుచున్నది. మతంగాద్రి పంపాపురమునకు తూర్పు భాగమున అత్యంత సమీపమున నున్నది. పంపాపతీ దేవాలయప్రాంతముననే హేమకూట మొప్పుచున్నది. మతంగగిరికి పడమటిభాగమున మాల్యవంత మున్నది. ఈ కొండకు దక్షిణపార్శ్వమున, అరమైలు దూరమున మధువనమును, దానికి ఉత్తరభాగమున నింబాపురమున వాలి భస్మరాసియుఁ గలవు. కావున కిష్కింధయే ఆనెగొందియని నిరూపించవచ్చును. వాలిసుగ్రీవుల పాదధూళిచే పవిత్రమయిన భూమి యిది. అళియరామరాజు తనయుఁడగు కొండరాజు మొదలు నేఁటి వఱకు దీనిని ఆర్వీటివంశజులు పాలించుచున్నారు. వీరిని 'నరపతు'♦

♦ కళింగరాజులు- గజపతులు; గుల్బర్గరాజులు- అశ్వపతులు; కర్ణాటరాజులు- నరపతులు అని వ్యవహరింపఁబడుచున్నారు.

లందురు. కావున దీనికి 'నరపతిసంస్థాన' మను పేరు గలిగెను. వీరు క్షత్రియులు; చంద్రవంశజులు.

ఇందు- ప్రధానవీధులు రెండు కలవు. ఒకటి- తూర్పువైపుగా నవబృందావనమునకును, రెండవది - ఇంచుక ఉత్తర దిశగా పోయి; మలుపుతిరిగి, పంపాసరోవరమునకును పోవును.

రంగనాథస్వామి దేవాలయము :

పంపాసరోవరమున కేగెడి వీధియందు యీ యాలయము కలదు. పూర్వాభిముఖము. ప్రాచీనాలయము. సుస్థితియం దున్నది. చుట్టును ప్రాకారమును, దాని నానుకొని లోపలిభాగమున కొన్ని మంటపములును, గర్భాలయమునకు ముందరివైపున ముఖమంటపమును గలవు. ఇది ఆనెగొంది ప్రభువుల ప్రధానాలయము. నిత్యపూజలును, రథోత్సవమును జరుగుచుండును.

గగనమహాలు :

పై యాలయమునకు యెదుట, వీధికి కుడివైపున ఒక పురాతన కట్టడము కలదు. దీనిని 'గగనమహ' లందురు. ఈపేరుతో మరియొక రాజభవనము విజయనగరసామ్రాజ్యమునకు కొంతకాలము ముఖ్యపట్టణముగానుండిన పెనుగొండయందుఁ గలదు. ఇది రెండంతస్తులు గలిగి, చాలవఱకు శిథిలమైయున్నది. దేవునిఉత్సవాదులను చూచుటకై అంతఃపురాంగనలకొఱకు యిది నిర్మింపఁబడినది.

ఆలయముదాఁటి ఉత్తరాభిముఖముగ కొన్నిగజములు నడచిన ఒకద్వారము కానిపించును. ఇది-బలిష్ఠములైన రాలతోఁగట్టబడినది. ద్వారము దాటినంతనే, త్రోవ రెండు పాయలుగా చీలును. ముఖమునకు ఎదురుగా నుండెడి పాయ 'గంగావతికి' పోవును, ఎడమచేతివైపు పాయ 'పంపాసరోవరము'నకు బోవును. సరోవరము, ఈ ప్రదేశమునకు ఒకటిన్నరమైళ్ళ దూరమునఁగలదు.

గవి రంగనాయకులు :

పంపాసరోవర మార్గము ననుసరించి నాలుగు ఫర్లాంగులు నడువఁగా, దారికి ఎడమవైపునఁగల పర్వతభాగమున, గండశిలల

మధ్య, ఒక చిన్నని దేవాలయమును, దానిపై భాగమున నొక మంటపమును అగపడును. క్రిందిభాగమున నుండి భద్రప్రవాహము పోవుచుండును. పైకి పోవుటకు శిలాసోపానము లున్నవి. మండపాంతర్భాగము మిక్కిలి శీతలముగానుండి, పాంథులని మార్గాయాసము పోగొట్టును. ఇంకొక ద్వారము కలదు. ఇదియే - గుహాద్వారము. లోపలి భాగము అంధకారబంధురము. దీపములేనిది పోవుటకు సాధ్యముకాదు. మోకాళ్ళపై దోగాడుచు, కొన్నిగజముల దూరము, అత్యంత ప్రయాసముగ పోవలెను. అచ్చటచ్చట ఎముకల ప్రోవు లగపడు చుండును. ఆ కారణమున వన్యమృగములకిది ఆవాసముగ నుండును. పోవఁబోవ, మూడు శిలావిగ్రహములు కానిపించును. అందొకటి రంగనాథునిది, రెండవయది - సుగ్రీవునిది; మూడవది - శివునిది. వీని సమీపమున నొక చిన్నమడుఁగు గలదు. ఇందలి నీరు చల్లఁగ నుండి, త్రాగుటకు రుచిగా నుండును. దీనిని ఆనుకొని మఱియొక గుహగలదు. అందు నరసింహుని విగ్రహ మున్నది. ఇచ్చట పర్వత శిలలు మిగుల నిట్టములై, తడినిరావృతములై, చూచుటకు భయము గొలుపుచుండును. ఈ గుహలకు క్రిందిభాగమున వాలి భాండారము కలదు. ముఖద్వారము నందున్న వాలిసుగ్రీవుల ప్రతిమలు చెక్కఁబడియున్నవి.

మేకోట :

ఇది రంగనాయకుల ఆలయమునకు వెనుకభాగమున నున్న కొండపై భాగమున ఈ కోటగలదు. ఆలయమునకును, కోటకును కొన్నిగజముల దూరమున్నది. దీనిని 'మేకోట' యందురు. కమ్మతమునకు చెందిన ముమ్మడి - సింగయనాయకుఁడు దీనిని కట్టించె నందురు. కాని, బుక్కరాజు తనయుఁడైన పెద్దరామప్పయ్య 'చిన్న మేకోట' పెద్దమేకోట 'చెంచుకోట' అనఁబరఁగు దుర్గత్రయమును నిర్మించినట్లు♦ పరిషత్పుస్తక భాండాగారమునయున్న వ్రాతప్రతివలన

---

♦ పుస్తకసంఖ్య - 3986. చూ - ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపు - 10, సంచి - 4, పుట - 195.

తెలియుచున్నది. ఇది - ఆతఁడు నిర్మించిన చిన్నకోటయై యుండ వచ్చును

ఇది - అంత పెద్దదికాదు. కాని, బలిష్ఠములై, ఉన్నతములైన గోడలచే నిర్మింపఁబడినది. పూర్వభాగమున తప్ప, మిగిలినవైపు లందు అగాధములగు లోయలుగలవు. ద్వారము దాఁటినంతనే దుర్గాలయము గానిపించును ఈ విగ్రహమునకు నేఁటికిని పూజాదికములు జరుగుచున్నవి. దీని సమీపమున ఆనెగొంది సంస్థానాధీశ్వరులగు శ్రీ రంగదేవరాయలవారి సమాధికలదు. దానిని దాఁటినంతనే, సంపూర్ణముగ శిథిలమైన రాజభవనమునకు చిహ్నములు లగపడును. ఆ భవనమునకు ముందటిభాగమున ఒక దిగుడుబావి కలదు. అందలి నీరు ఇప్పుడు పానయోగ్యముకాదు. బావికి పైభాగమునఁగల శిలల మధ్యమున, ఇంచుక పైవైపున, ఒక విశాలమైన గుహగలదు అందు అచ్చటచ్చట బూడిద దిబ్బలు కానిపించును. ప్రాచీనకాలమున - అదియొక ఋష్యాశ్రమమై యుండవచ్చునని తోచుచున్నది.

అంజనాద్రి :

గవి రంగనాయకులగుడినుండి పంపాసరోవర మార్గమున, కొంత దూరము పోయినపిదప, కుడివైపున, ఒక కాలిబాట యగపడును. దానిననుసరించి పోయినచో, ఒక ఫర్లాంగుదూరమున, ఒకకొండ కానిపించును. అదియే - అంజనాద్రి. అంజనాదేవి, హనుమంతుని ఈ పర్వతమునందు కనుటచే దానికాపేరు గలిగెను. ఇందు - హనుమంతుని ఆలయమున్నది. ఆలయము ముందటిభాగమునఁ గల శిలలమధ్య తొంగిచూచినచో అగాధమగు గుహ కానిపించును. చూచుటకిది మిక్కిలి భయంకరముగానుండును. ఇందే - అంజనాదేవి తపమాచరించెననియు, ఆంజనేయుని గనెననియు చెప్పుదురు.

పంపాసరోవరము :

అంజనాద్రినుండి మరలి, ప్రధానమార్గముఁ గలిసికొని, కొంత దూరము నైరృతిభాగమున పయనించినచో ఒకరాతికాలువ యగపడును. ఇందు - నిర్మలమైన తుంగభద్రా నీరము ప్రవహించు

చుండును. దానిని దాటి, కొన్ని గజముల దూరము నడచినంతనే, పురాణ ప్రసిద్ధమైన పంపాసరోవరము దృష్టి గోచరమగును ఆహా! ఏమి యాసరోవరపు టందము! రెండువైపుల – నిట్టములై, ఉన్నతములైన శిలాలంకృతములగు పర్వతరాజములు! వేఱొకవైపున – తుంగభద్రాస్రవంతీ తరంగధ్వనులు! ఇంకొకవైపున – శబరీ గుహాది పవిత్రస్థలములు! ఇది – పర్వతములమధ్య స్వాభావసిద్ధముగ ఏర్పడిన సరస్సు. దిగుటకు శిలాసోపానములుగలవు. వాడుక లేకపోవుటవలన నీరంత పానయోగ్యముగ నుండదు. ఇందు – తామరతీఁగలు అన్ని వైపుల నల్లుకొని, కుసుమ విసరములతో నొప్పారుచుండును. రఘువంశోద్భవుఁడైన శ్రీరామచంద్రుని పాదధూళిచే పవిత్రమైన దీభూమి.

బ్రహ్మపుత్రిక యగు పంపాదేవి ప్రతిదినమిందు స్నానము చేసి, తపమాచరించెను. కావున దీనికి 'పంపాసరోవర' మను పేరు గలిగెను.

మానససరోవరము :

పంపాసరోవరమునకు పైభాగమున, ఎడమచేతివైపున, నాలుగైదు గజముల దూరమున, మఱియొక చిన్నని సరస్సు గానిపించును. అదియే – మానససరోవరము. తొల్లి, పార్వతి ఈ తీర్థమున స్నానమాచరించి, పరిశుద్ధ వృత్తితో, తన మానసబలమువలన గణపతిని పుత్త్రునిగాఁ బడసెను. కావున దీని కీ పేరుగలిగెను.

పంపాసరస్సునకు పైభాగమున ముఖమంటపముతోఁ గూడిన చిన్నని ఆలయము కలదు. అందు – గజలక్ష్మీదేవి శిలావిగ్రహమున్నది. ఉత్తరహిందూస్థానమునుండి వచ్చిన బైరాగులు ఇందు వసించుచుందురు. వారే – ఈ దేవి పూజారులు.

శబరిగుహ :

గజలక్ష్మి ఆలయమునకు ఎడమవైపున, మూఁడు నాలుగు గజముల దూరమున, శిలలతో నేర్పడిన ఒక గుహాద్వారము కలదు. అదియే – మతంగుని శిష్యురాలైన శబరి వసించిన గుహ. గురుని

ఆనతిని శ్రీరామచంద్రమూర్తి దర్శనమునకై ఆమె యట వేచి యుండెను. యాత్రికుఁ డటనుండి మరలి, వచ్చినత్రోవనే, ఆనెగొంది చేరవలయును.

చేరిన పిమ్మట నాతఁడు తూర్పుదిక్కునకుఁ బోయెడి మార్గము ననుసరింపఁగనే, రాజభవనము కానిపించును. ఇది - కొంతకాలము క్రిందట కట్టఁబడినది. దీనిని దాఁటి కొన్నిగజములు నడువఁగనే, ఎడమవైపున, ఒకమహాద్వారము కానిపించును. దీనిలోపలిభాగమున సంస్థానమునకుఁ జేరిన కచ్చేరు లుండినవి. ద్వారమునకు అభిముఖముగా నొక వీథి కలదు. అందలి త్రోవ తుంగభద్రానదికి పోవును. ఆదారి ననుసరించి కొన్నిగజములు నడువఁగనే, కుడివైపున, ఆంజనేయాలయము కానిపించును. అందు - చూడఁదగిన శిల్పము లేదు. దానిని దాఁటి కొన్ని గజములు నడువఁగనే, కుడిచేతివైపున రెండంతస్తులుగల భవనమొకటి కానిపించను పూర్వము - ఇదియొక యాలయము. శిథిలమై యుండుటవలన దీనిని ఆనెగొంది సంస్థానాధీశ్వరులు పథికాశ్రయముగా మార్చిరి. దీని పైభాగమున నిలువఁబడి చుట్టును చూతుమేని ప్రకృతి యెంతయు రమణీయముగా నుండును. ముందుభాగమున తుంగభద్రానది తన సహజ గాంభీర్యమున సర్వదా ప్రవహించుచుండును. దీనిని ఆనుకొని లక్ష్మీనృసింహాలయము కలదు. లోపలిభాగము చూచుటకు అందముగా నున్నది.

చింతామణి ఆశ్రమము :

పథికాశ్రయమును దాఁటి, తుంగభద్ర కభిముఖముగా, కొన్ని గజములదూరము నడచినచో, కోటగోడలచే ఆవృతమైన యొక శిలాద్వార మగపడును. దానిని దాఁటి, గోడననుసరించి, కొన్ని గజములు పోయినచో, చింతామణి ఆశ్రమద్వారము కానిపించును. 'చింతామణి' యను యోగి యిందు వసించినకారణమున దీనికా పేరు గలిగెను. లోపలిభాగమున కొన్ని మంటపములును, ఆలయమును గలవు ఇందు - మహిషాసుర మర్దనియు, ఈశ్వరునియు విగ్రహములు కలవు. ముందుభాగము పుష్పలతాశోభితమై ఎసలారు

చున్నది. ఇంతటి ప్రశాంతప్రదేశము మరెచ్చటను గానిపించదు. వైరాగు లిందు వసించుచుందురు.

దీనికి పశ్చిమభాగమున, తుంగభద్రాతీరమున, ఒక గొప్ప శిలాతలము కలదు. అందుండియే శ్రీరామచంద్రుండు సప్తతాళ భంజనాది కార్యముల నొనర్చెనందురు. ఆ ప్రదేశమునకు ఎట్ట యెదుట, నదికి ఆవలివైపున, కొంతదూరమున నొక పర్వత మగ పడును. అందు - అగస్త్యుడు కొంతకాలము తపమాచరించెనను ప్రతీతి కలదు. దానిపై భాగమున కొన్ని శిథిలము లగపడును.

కృష్ణరాయల సమాధి:

యాత్రికుఁ డిటనుండి మరలి, ప్రధానమార్గము ననుసరించి, పూర్వాభిముఖముగా పయనించినచో, మరల నొక శిలా నిర్మితమైన కోట వాకిలి యగపడును. అందుండి తుంగభద్రలోనికి దిగుటకు మెట్లు కలవు. దిగినంతనే నదీగర్భమున అఱువదినాలుగు కంబములు గల పురాతన శిలామంటప మగపడును. దానిని శ్రీకృష్ణదేవరాయల సమాధి యందురు కాని, సమాధియని నిరూపించుటకుఁ దగిన శాసన మెచ్చటను ఇందుఁ గానరాదు.

నవబృందావనములు :

మండపమును దాఁటి ఈశాన్య దిక్కునకు మరికొంత దూరమేగినచో, నది రెండు పాయలుగాఁ జీలును. ఈ పాయల మధ్యభాగమున ఒక ద్వీపముకలదు. అందే - నవబృందావనములు వెలయుచున్నవి. ఇవి - మాధ్వ బ్రాహ్మణులకు పవిత్రస్థలము. ఇచ్చట - నవ బృందావనములుకాక, పదిబృందావనములు కలవు. వీని ప్రక్కన నుండు శాసనములందు ఆయా యతి నామమును, సమాధియైన కాలమును సూచింపఁబడియున్నవి. కాని, కొన్నిచోట్ల అంకెలు నమసి యున్న కారణమున స్పష్టముగఁ దెలియుటలేదు.

1. శ్రీ పద్మనాభతీర్థ ... శక 1(2)46
2. శ్రీ కవీంద్రతీర్థ ... 1321

3. శ్రీ వాగీశతీర్థ ... 1329
4 శ్రీ గోవిందతీర్థ ... 1425
5. శ్రీ రఘునందనతీర్థ ... 1455
6. శ్రీ వ్యాసరాజతీర్థ ... 1460
7. శ్రీ రఘువర్యతీర్థ ... 1479
8. శ్రీ సుధీంద్రతీర్థ ... 1545
9. శ్రీ రామతీర్థ ... 15-5
10. శ్రీ శ్రీనివాసతీర్థ ... 15—

వేసవికాలమందీ ప్రదేశమునకు సులభముగాఁ బోవచ్చును. ఇతర కాలములందు 'అరిగోల' సాహాయ్యమునఁ బోనగును. బృందావనముల నానుకొని యొక రాజభవనము కలదు. అది ఇప్పుడు ఖిల రూపమున నున్నది.

తారాపర్వతము :

నవబృందావనములకు ఉత్తరభాగమున, నదికి ఆవలివైపున, ఈ పర్వతము కలదు.

దేవగురుఁడు తారతోడ శివపూజాధురంధరుఁడై, వేయివర్షములు, ఈ పర్వతమున వసించెను. అందుచే – ఈ పర్వతము 'తారా పర్వత'మని పిలువఁబడుచున్నది.

ఇంతటితో – హాంపీయాత్ర సమాప్తము.

---

పైని పేర్కొనిన యతుల నామములును, వారి కాలమును వ్రాయుటలో స్వానుభవమేగాక '*A Guide to Hampi and Vijayanagar*' అను పుస్తకమును సాయపడినది. రఘునందనతీర్థుల బృందావనము సుగ్రీవుని గుహకు సమీపమున తుంగభద్రయందుఁ గలదని వ్రాసియుంటిని. కావున, ఈ రఘునందన తీర్థులు రెండొక్కరై యుండవలెను.